

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు : విద్వాన్ బుల్లుసు సీతారామశాస్త్రి

ఈ సంచికలో






1—5—81 సంచికలో ధూర్జటి కవితా మాధుర్యము, మినీకవిత - మొదటితత్త్వ పరిశీలన గ్రంథం, తెనాలికవుల సాహిత్య సేద్యం, కవిత్వం - అందమైన అబద్ధం మొదలగునవి ఉంటాయి.

1, 16 తేదీలలో ప్రచురింపబడును


చందా :

సంవత్సరమునకు రు. 12—00.

అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము 4 | రాజమహేంద్రవరము 1-5-1981 | సంచిక 13

# 'కావ్యవిమర్శ' - వేదాటి రఘుపతి

– శ్రీ వి. రఘుపతి.

పాశ్చాత్య సాహిత్య ప్రభావం వలన విమర్శప్రక్రియ మన ఆంధ్రసాహిత్యంలో ప్రభవిల్లినది. కాని ప్రాచీనాలంకారాలంకారికుల దృష్టిలో కూడ ఈ విమర్శ ప్రవృత్తి లేకపోలేదు. వారు 'మీమాంస' అన్న పదము; చర్చ, విచారణ అన్న పదాలు; ఈ అర్థములోనే వాడినారు. 'వి' పూర్వక 'మృశ్' ధాతువునుండి 'విమర్శ అన్న పదమేర్పడుతుంది. గ్రీకు భాషలో, 'క్రిటిన్' అన్నది విమర్శ అర్థములోనే ఉండి, దానినుండి 'క్రిటిసిజమ్' అన్న ఆంగ్లపదము ఏర్పడినది. కావ్య గుణదోషవిచారణమే విమర్శ పద ప్రయోగార్థము. నిత్యజీవితమున మంచి చెడులు తెలియచేయు ప్రతి సందర్భమున ఈ విమర్శ పదము వాడుతున్నప్పటికిని, సారస్వత సంబంధిగా ఇది రూఢమైనది.

కవి, సృష్టికి వ్యాఖ్యాత కాగా, విమర్శకుడు కవికావ్యమునకు వ్యాఖ్యాత అగుచున్నాడు. కవిత్వం హృదయసంబంధి, విమర్శ మేధాసంబంధి. కావ్య తత్త్వమును వివేచించి, దాని లక్షణములను పరిశీలించి, తద్వైశిష్ట్యమును నిర్ణయించుటయే కావ్య విమర్శ. గుణదోష విచారణమును బట్టి విమర్శనా మూడు విధములుగా విభజింపవచ్చును. గుణములను గుణములుగా, దోషములను దోషములుగా విమర్శించుట ఉత్తమమనియు, గుణములు మాత్రమే పేర్కొని దోషములను కప్పిపుచ్చినచో మధ్యమమనియు, గుణములను దోషములుగా దోషములను గుణములుగా పేర్కొనుట అధమమనియు అన్నారు. కాని కావ్య విమర్శ అన్నది గుణదోషముల నున్నవాని నున్నట్లుగా వివరించునపుడే అది సమగ్రమైన విమర్శ అనిపించుకొనును. విమర్శ శాస్త్రమనియు, శిల్పమనియు, ఉభయాత్మక మనియు వివిధములు కలవు. సారస్వ విమర్శలో, శాస్త్రపద్ధతిని పరిశీలించుట, ఆలంకారిక పద్ధతిని పరిశీలించుట అని ద్వివిధములు కలవు. కావ్య సాద్యంతము విచక్షించి, తత్కావ్యగత గుణదోషములను గూర్చి పక్షపాత రహితములగు అభిప్రాయములు వెలిబుచ్చుట శాస్త్ర పద్ధతి. ఇక కావ్య మందలి ఒక పద్యమోగాని అది ఆలంకారిక నియమానుసారముగా సాగినదా? లేదా? అని పరిశీలించుట ఆలంకారిక పద్ధతి. ఈ ఆలంకారిక పద్ధతిని కేవలం దోషములను చర్చించుట కలదు. 'ప్రమాదో ధీమతామపి' అని నానుడి కలదు. ఎతటి వాడికైనా ఎక్కడో ఒకచోట తప్పటడుగు వేయక తప్పదు. అందుకొరకే 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అని స్మృతి వాక్య మేర్పడినది. కాని 'విశ్వశ్రేయః కావ్యం' అన్న సర్వజనామోద వాక్యము ఆస్మృతి వాక్యాన్ని ఖండిస్తూనే ఉంది.

విమర్శనము యొక్క ప్రధాన ప్రయోజనం మహాకవుల గ్రంథతత్త్వమును సామాన్యులకు అందచేయుట. కవి అర్థమును బట్టి ప్రయోగించిన శబ్దములకు, విమర్శకుడు శబ్దమును ఆశ్రయించి, అందులో అంతర్నిగూఢమైన రసానందార్థనవనీతాన్ని అందిస్తాడు. దీని ద్వారా ఆ కావ్య ప్రాశస్త్యమునకు విమర్శకుడే కారణమవుతున్నాడు. గుణదోషములు ఉన్నవి ఉన్నట్టుగా చెప్పుట వలన, భవిష్యత్కాలమున దోషసహిత కావ్యములు వెలువడుటకు ఆస్కారముండదు. కవి కన్న విమర్శకునకు అధిక పాండితీ విభవము అవసరము. కావ్యమున ఔచిత్యం, పాత్రపోషణం, రసపోషణం, రచనా పద్ధతి, ఆలంకారిక నియమాలు మొదలగు సర్వలక్షణముల సమగ్ర విజ్ఞానము విమర్శకునకు కలిగియుండవలెను. అప్పుడే కావ్య విమర్శన యోగ్యత ఏర్పడును. ఉత్తమ కావ్య నిర్ణయము విమర్శవలన తెలిసి, వాటినే పఠించుకొనుటకు _వ్యవధిలేని_ సాహిత్య ప్రియులకు అవకాశము లభించును. విమర్శకుని భావనా బలం వలన. కవితా

వ్యాపారంలో మునిగిన కవిరచనలో అప్రయత్నంగా దొరలిన పదాలకు విశేషార్థాలు కలిగించి, ఆ కవికి సత్కీర్తి సంపాదించగలడు. ఇంతటి ప్రమాదజనకమైన విమర్శను గురించి కేవలం రంధ్రాన్వేషణమే విమర్శ పని, అన్న అనాలోచిత అపవాదం మోపినారు.

విమర్శకుడు కవితా హేతువులైన ప్రతిభావ్యుత్పత్తి - అభ్యాసములు కలిగి ఉండవలెను. రాగద్వేషముల కతీతుడై, నిష్పక్షపాతముగా విమర్శ కొనసాగించవలెను. సానుభూతి కలిగి, కవి దేశకాల పరిస్థితులననుసరించి విమర్శను వ్రాయకొనగలడు. నిశితపరిశీలనాదృష్టి, అసమాన పాండిత్యప్రకర్ష విమర్శకునకు తప్పక కలిగి యుండవలెను. అన్యభాషా సారస్వత పరిచయం కూడ అవసరం. ఈర్ష్యావేశములకు అతనిలో ఏమాత్రం తావు ఉండకూడదు. ఈలక్షణాలు కలిగి ఉన్నప్పుడే విమర్శకుని కావ్యవిమర్శ సమగ్రమై సర్వజన సమ్మతిని అందుకోగలదు.

ఏ గ్రంథమున కా గ్రంథమే ప్రమాణముగా తీసుకొనవలెనే కాని ఒక దానితో వేరొక కావ్యమును పోల్చి విమర్శించుట ఉత్తమ విమర్శ లక్షణము కాదు. అజ్ఞానము, అసూయ, పక్షపాతము మొదలగు వాటితో మిళితముగా చేయు విమర్శ దుర్విమర్శ అగును. మహాకవుల గంభీర భావములు, ధర్మసూక్ష్మసూత్రములు, ధ్వని ప్రాయంగా విహరించినవి అవగతము చేసుకొనక, వానిని దోషములుగా పేర్కొనుట దుర్విమర్శ అగును. కావ్యములోని గుణలేశమును గాని ప్రశంసించుట ఉత్తమ విమర్శకుని లక్షణం. కేవలం దోషములు వెలువరించుట అవివేకం. అందుకే నన్నెచోడుడు,

'రాకవిడిచిన రసమున కెరగిరాక
పిప్పికి రిగెడి ఈగలపెల్లువోలె'

అని గుర్విమర్శకుని దృష్టిని చూపించినాడు.

కవి కన్న ఉన్నత పీఠమలంకరించిన విమర్శకుని గురుతర మగు బాధ్యత ప్రశంసనీయం. పుష్పమెంత రసవత్తరమైన దైనను విమర్శకుడు లేక దానికి వ్యాప్తి లేదు. సాహిత్యక్షేత్రమునందు తలయెత్తు కలుపు మొక్కలు వేరు చేసి రమ్యములైన కావ్యపుష్పములు పుష్పించి, ఫలవంత మగుటకు కృషి చేయు తోటమాలి విమర్శకు డని, అనారోగ్యకరమైన సాహిత్యమును రూపుమాపి సత్సాహిత్యము వర్ధిల్ల చేయు దివ్యౌషధము విమర్శయని గుర్తింపదగును.

—···—

# తెలుగు కవులు - ఏడుపు వర్ణన

- శ్రీ విట్ట వేణుగోపాల్, ఎం.ఎ.

ప్రపంచమునందు సృష్టిఆద్యంతములు ఏడుపుతోనే ప్రారంభమై ముగియుచున్నవి. 'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః' అని భరతుడు రససూత్రమును నిబంధించెను. విభావానుభావ వ్యభిచారులయొక్క సంయోగము వలన రసము నిష్పన్నమగును. అట్టి రసములు.

'భర శృంగారము హాస్యము
కరుణయు వీరము భయానకము భీభత్సం
బుర రౌద్ర మద్భుతము శాం
తి రసంబును రసము లనగ దనరుం
గృతులన్.'

అని తొమ్మిదిగా చెప్పబడుచున్నవి. ఇందు క్రమముగా శృంగార, హాస్య, కరుణ, వీర, భయానక, భీభత్స రౌద్ర, అద్భుత, శాంతము లను తొమ్మిది రసములకు క్రమముగా రతి,హాస, శోక, యత్న భయ, జుగుప్సా, క్రోధ, విస్మయ, శమములు స్థాయీభావములు. కాంగా కరుణ రసమునకు స్థాయిభావము శోకము. సంస్కృతములో ఆదికావ్యము రామాయణమును వ్రాసి చిరయశస్వి యైనవాడు వాల్మీకి. క్రౌంచ మిథునములో నొకదానిని గూల నేసిన నిషాదుని గాంచిన వాల్మీకి నుండి వెడలిన శ్లోక మిది.

'మానిషాద ప్రతిష్ఠాం త్వ
మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక
మవధీః కామ మోహితమ్.

ఈశోకమే శ్లోకముగా మారినది. శోకముచే బహిర్గత మైన యీ వాక్యశ్లోకమై సంస్కృతభాషా రచిత కావ్యమైనది. ఈవిధముగా కవిత్వము శోకముతో నారంభమైనది. అట్లే సృష్టిలో జననము శోకముతోనే ప్రారంభ మగుచున్నది. ఇట్టి శోకమును తెలుగు సాహిత్యమునందు పలువురు కవులు పలురకములుగా వర్ణించి తనివి చెందిరి. అట్టి వారి ఏడుపు వర్ణనల నిక్కడ పరికింతము.

ఆదికావ్యమగు 'ఆంధ్రమహాభారతము' నందు నన్నయ్య ఏడ్పును చక్కగా వర్ణించినాడు. పాండవులు లక్కయింటిలో జచ్చినారను వార్త వినిన ధృతరాష్ట్రుడు ఏడ్చిన విధము.

'బాధిత శత్రువర్గు లగు
పాండుకుమారుల దుఃఖవార్త మ
ర్త్యాధములైన సౌబల ది
నాధిపసూనులయొద్ద నప్పు దు
ర్యోధను డాదిగాగ సుతు
లున్న సభన్ విని దుఃఖితాత్ముడై
యాధృతరాష్ట్రు డావగిచి
నట్లుఅచెన్ వివిధ ప్రలాపుడై.

బాధింపబడిన శత్రువర్గము గల పాండవుల మరణ వార్తను వినిన ధృతరాష్ట్రుడు శకుని, కర్ణుడు, దుర్యోధనాదులున్న సభలో దుఃఖితాత్ముడై వివిధ

ప్రలాపములతో 'ఆవు' అఱచిన ట్లఱచె నని వర్ణించెను. సుతమరణమునకై ఏడ్చిన యీతని ఏడుపు నోరులేని పశువగు ఆవు అరపువలె నుండె నని సహజ దీనారావమును చిత్రించినాడు.

కవిబ్రహ్మ యగు తిక్కన ద్రోణపర్వమునందు అభిమన్యుడు మరణించిన ఘట్టమున అర్జునుని ఏడుపు వర్ణన కలదు.

'హా యనుఁ ధర్మరాజ తన
యా యను నన్నెడబాయ నీకు జ
న్నే యను దల్లి నేప జను
నే యను, కృష్ణుఁడు వీడె వచ్చెరా
వే యను నొంటి వోక దగ
వే యను నే గతి బోవు వాఁడ నే
నో యభిమన్యుఁడా యను బ్రి
యోక్తుల నుత్తర దేర్పవే యనున్.'

ధర్మరాజ తనయా నన్నెడబాసి పోవుట నీకు తగునా. ఒంటరివై పోవుట తగునా. ఉత్తరతో ప్రియమైన మాటలు పలుకు మని లోకసహజముగా వర్ణించెను. తిక్కన స్త్రీపర్వమునందు ఏడుపు వర్ణనను మిగుల వర్ణించెను.

ప్రబంధ పరమేశ్వరు డగు ఎఱ్ఱన తన ఆరణ్యపర్వము నందు ఏడ్పును చక్కగా వర్ణించినాడు. రామరావణులకు యుద్ధమారంభమైనది. లక్ష్మణుని చేతిలో ఇంద్రజిత్తు మరణించినాడు. రావణుని ఏడుపి ట్లున్నది.

తనయుని మరణం బేర్పడ
విని దశకంధరుడు శోకవివశుండై బో
రన బాష్పము లొలుకగ హా
యనుచుం బదినోళ్ళ దెఱచి యఱచెం
బెలుచన్.

శోకముచే వివశుడై పదినోళ్లు తెఱచి హా' యనుచు బోరున బాష్పములు రాలగా మిక్కిలి బిగ్గరగా ఏడ్చెనట.

లంకపై రాముడు దండెత్తినాడు. రణరంగమున లక్ష్మణునిచే ఇంద్రజిత్తు నిహతుడైనాడు. సులోచన దుఃఖము రంగనాథ రామాయణమున

'హా ప్రాణ నాయక హా జీవితేశ
హా ప్రాణనాయక ఆజిలో నెదిరి
యేపార నిన్ను జయించె నేనరుడు
చూపోపజాలక దులకగా జూచి
పాపపుబ్రహ్మ యీ పట్ల నిద్దఱిని
బాపంగ దగునె దాత్పర్యంబు లేక
... ... ...
మనసునగల యట్టి మమత రెట్టింప
నలయుచు సొలయుచు నసురుసురనుచు
లలిదూలి యజ పుష్పలతిక చందమున
జని దశకంఠు నాస్థానంబు జేరి
తన కన్నులను బాష్పతతులును దొరుగ
మదిరాక్షి యేడ్చుచు మమత రెట్టింప

... హా ప్రాణనాయకా! నాథా! నిన్నాజిలో గెలిచిన వీరు డెవరు? నీ రూపునకు సహించని బ్రహ్మ యిట్లు నీ ప్రాణముల బాపెనా? అని స్త్రీ జనోచితములగు ఉస్సురుస్సులు తూలిపడుటలు స్రవించు బాష్పధారలు చక్కగా వర్ణితములు.

కాశీఖండమున శ్రీనాథుడీవిధముగా వర్ణించెను. సుశీల విద్యాధరుని తన భర్తగా తలచినది. అతడు మరణ మొందినాడు. అప్పుడు సుశీల అతనికై

'కొసరి వసంతకాలమున
గోయిల క్రోల్చిన భంగి నేడ్చె న
బ్బిసరుహ నేత్ర కొండ చఱి
పెద్ద యెలుంగున వెక్కి వెక్కి వె
క్కసముగు మన్యు వేగమున
గాటుక కన్నుల నీరు సోనలై
యుసిరిక కాయలంతలు ప
యోధరముల్ దిగజారునట్లు గన్.'

వసంతకాలము నందలి కోయిల వలె ఉసిరిక కాయఅంతటి అశ్రుకణము చనుగట్టు పైబడి స్రవించునట్లుగా పెద్దయెలుంగుతో కాటుక కన్నులనుండి కన్నీళ్ళ సోనలు ప్రవహించినవి. శృంగారరస పరిపోషణపై మక్కువ గల శ్రీనాథుడు ఏడ్పునందు సైతము స్తనద్వయమును, కాటుక కన్నులను. మరవలేదు.

భాగవతమున పోతన సరస్వతి నుద్దేశించి, కాటుక కంటి నీరు చనుగట్టు
పయిన్ బడ నేల యేడ్చెదో, యనియు
చిత్రకేతూపాఖ్యానము నందు

కుంకుమరాగ రమ్య కుచ
కుంభములన్ కడు కజ్జలంబుతో
పంకిలమైన బాష్పములు
పాల్పడ మజ్జన మాచరించుచున్
గంకణపాణి పల్లవ యు
గంబున వక్షము మోదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చె పరి
భావిత పంచమ సుస్వరంబునన్.

అనియు వర్ణించెను. చిత్రకేతుని భార్య కృతద్యుతికి 'అంగీరసుని' దయచే పుత్రోదయమగును. తక్కిన చిత్రకేతుని భార్యలు సంతాన సంతోష వికలలై విషమిచ్చి ఆబాలుని సంహరింతురు. చనిపోయిన బాలుని గని కృతద్యుతి పైవిధముగా ఏడ్చినదట. కుంకుమరాగముచే రమ్యమైన కుచములపై కాటుక కంటినీరు పడునట్లుగా ఎదను గ్రుద్దుకొనుచు, కరకంకణములు ధ్వనించుచుండగా అమ్మోమ్మను బాదుకొనుచు ఏడ్చినది. ఇట ఎదను గ్రుద్దుకొనుట, కరకంకణముల ధ్వని వర్ణితములు. ఇది అత్యంత స్త్రీసహజముగా నున్నది. కర్మేంద్రియాలలో 'నయనము' ప్రధానము కావున ఈతడు కాటుక కన్నులను వర్ణించినట్లు తోచుచున్నది.

కృష్ణ నిర్యాణఘట్టమున అర్జునుడు దుఃఖించుచు ధర్మరాజుతో

మనసారథి మనస చివుడు
మన వియ్యము మనసఖుండు మన
బాంధవుడున్
మనవిభుడు గురుడు దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా !

అని కన్నీరు కరతలంబున దుడిచికొని గద్గదస్వరమున నిట్టూర్పులు నిగిడించుచు పలికినాడు. కన్నులలో కన్నీళ్ళు సుడివడుచుండగా దుఃఖమును హృదయమందే యణచుకొనిన అర్జునుని ధీరహృదయము సుగుణశీలముగా వర్ణించినాడు.

మను చరిత్రయందు పెద్దన వరూధిని-
'పాటున కింతులోర్తురె? కన
పారహితాత్మక! నీవు త్రోవని
చోటఁ భవన్నఖాంకురము
సోకె, గనుంగొను మంచు జూపియ
ప్పాటల గంధి వేదన నె
పంబిడి యేడ్చెఁ గల స్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచను
మిట్టల నశ్రులు చిందువందగన్.

మగవారి పాటుల కాడువారు ఓర్చుకొనగలరా? అని నఖాంక సహిత కుచద్వయము చూపి, ఆపాటలగంధి కలస్వనముతో చనుగట్టుపై నశ్రులు చిందునట్లుగా ఏడ్చినది.

కోపోద్రిక్తురాలగు తిమ్మనగారి సత్యభామ

'ఈసునబుట్టి డెందమున
హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చె ప్రాణవిభు
కట్టెదుటన్ లతాంగి పంకజ
శ్రీ సఖమైన మోము పయి
చేలచెరంగిడి బాల పల్లవ
గ్రాస కషాయకంఠ కల
కంఠ వధూకలకాకలీధ్వనిన్.

చిగురాకులు మెక్కి మత్తిల్లిన కోకిల వలె మనోహరముగా నేడ్చినట్లు ముద్దు పలుకుల తిమ్మన వర్ణించినాడు.

విరహబాధలో నున్న శ్లేషకవితా చక్రవర్తి యగు భట్టుమూర్తిగారి గిరిక

'ఆజాబిల్లి వెలుంగు వెల్లికల డా
యన్ లేక, రాకా నిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ బటాం
గ్రం బెత్తి, యెల్గెత్తియా
రాజీవానన యేడ్చె. కిన్నర వధూ
రాజత్కరాంభోజ కాం
భోజీ మేళవిపంచికారవసుధా
పూరంబు తోరంబుగాన్.

రాయలవారి కాలమున ప్రజలకు సంగీతముపై గల మోజును దృష్టియందుంచుకొనియో లేక కాంభోజరాగము శోకరసానుగమో? సంగీత నిష్ణాతు డగు భట్టుమూర్తి గిరికను కాంభోజరాగమున నేడ్పించెను.

విశ్వామిత్రుని యాగరక్షణార్థమై రాముని పంపించిన అయోధ్యారాజు రామభద్రుని దశరథుడు

'కానక గన్న సంతానము గావున
కానక గన్న సంతానమయ్యె
నరయ గోత్ర విధానమై తోచు గావున
నరయ గోత్ర నిధానమయ్యె నేడు
ద్విజకులాదరణవర్ధిష్ణుండు గావున
ద్విజకులాదరణవర్ధిష్ణుడయ్యె
వివిధాగమాంత సంవేద్యుండు గావున
వివిధాగమాంత సంవేద్యుడయ్యె
... ... ... ...

కానక కన్న సంతానము కానక కన్న సంతానమయ్యెననియు, ద్విజుల నాదరించువాడు ద్విజ కులతతుల నాదరింప నేగననియు శ్లేషలో దుఃఖించెను. విద్యలయందు స్పర్ధగలరాయల కాలమగు, ఔచిత్యానౌచిత్యములు పాటించక దశరథుని ఏడ్పును శ్లేషయందు వర్ణించెను.

తెనాలి రామకృష్ణుని నిగమశర్మోపాఖ్యానమున

'తన గృహమిట్లపత్య పశు
దారధనాదులతోడ బ్రుగ్గగా
గని వెఱగంది కన్నుగవ
గ్రంతల ముంతల బోసినట్లు బో
రన గడు బాష్పపూరములు
గ్రమ్మగ నేడ్చుచు మూర్ఛపోయి య
ల్లన తెలిసెన్ వినింగతకు
ల వ్యవహర్త మానోబలంబునన్.'

గలదు.

తావలచిన మాలకన్య అగ్నికాహుతి కాగా చూచి కన్నుల రంధ్రముల నుండి ముంతలతో గ్రుమ్మరించినట్లు అధిక బాష్పధారల వెలయించెను. ఇట అధిక బాష్పధారలు ముంతలతో గ్రుమ్మరించినట్లనుటను బట్టి నిగమశర్మ గుండెలోతులలోని వేదన వ్యక్తమగుచున్నది.

శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమున లోహితాస్యుడు మరణించగా చంద్రమతి ఏడ్చిన విధ మిది.

'అకటా చేరెడు నేలకుం దగడె స
ప్తాంభోధి వేష్టిధవ
త్సకల ద్వీప కలాప భూపమకుటాం
చత్పద్మరాగోజ్జ్వల
ప్రకటానర్ఘళ నిర్గళత్కిరణ శుం
భత్పాదుడైనట్టి, రాజకుమారుండు...

సప్తసముద్ర పరివేష్టిత భూవలయమందలి రాజుల మకుటములందలికిరణ ప్రసారముచే నలంకరించబడిన రాకుమారుడు చేరెడు నేలకుదగడా? అని రాజీవిని వెలార్చెను. ముక్క తిరుగకుండా ఏక బిగిని ఏకసమాసమునందు ఏడ్పించినాడీ కవి.

వేదము వేంకటరాయ శాస్త్రిగారి ప్రతాపరుద్రీయమున ప్రతాపరుద్రుని బంధించి తీసికొని పోయిన పిదప విద్యానాథుడు గోదావరిని గని దుఃఖించెను.

'వేసరకేడ్చె దేల యర
విందసఖ ప్రతిమారుణాస్యమున్
మూసికొనంగ శైవలపు
మూర్ధజముల్ గడుగాలి నూర్చుచున్
భాసుర వీచికా త్రివళి
పైపయిదోప రథాంగయుక్ స్తనో
చ్ఛ్వాసము మీఱ మాధుకర
ఝంకృతి మ్రోల్గున నంచ యెల్గునన్'

గోదావరిని స్త్రీగా నూహించుచు అరవింద సఖుని ప్రతిరూపము ఎఱ్ఱబడిన ముఖమును మూసికొని నాచుచే కప్పబడి గాలిచే నూరడింపబడుచు మాటిమాటికి దుఃఖపు అలలు పైపై బడగా చక్రవాకముల వంటి స్తనములు కదలునట్లుగా దీర్ఘ-ఉచ్ఛ్వాసముల దీయుచు తుమ్మెదల ఝంకారమువలె హంసల మ్రోల్గులవలె నుండ విద్యానాథుడు దుఃఖించెను. రాజు బంధింపబడుట నిట ప్రకృతి సైతము రోదించుచున్నదట.

బుద్ధుడు సన్యాసియై వచ్చిన పిదప గనిన శుద్ధోధనుని దుఃఖమిట్లున్న దని పింగళి కాటూరి కవులు సౌందరనందమున వర్ణించిరి.

తడియారని కన్గవయున్
బోడియాతీన నోరు నౌము బుత్రునికై చే
డ్పడి యున్న వృద్ధభూపతి
తడబడుచున్ జేర వచ్చె
దనయా యనుచున్.

లేక లేక కలిగిన నోములపంట సన్యాసియై రాజధాని కరుదెంచెను. తనయునికై వృద్ధ భూపతి ఏడ్వనిక్షణములేదు. తడియారని కన్నులతో పొడియాతీన నోరుతో తడబడుచు తనయుని దర్శనము నకరుదెంచెను. ఇందు అత్యుత్కటముగు ఏడ్పును లలిత పదములతో నల్లినారు పతిసెడ బాసిన సుందరి విలాపము_

వలలో జిక్కిన జక్కవ
పులుగుంబలెడిందువడికవ్వాకవ్వమనుచున్
విలపించు నామనోహరు
నెలుగల్ చెవిసోకుచున్న వినటికినాథున్'

వలలో జిక్కిన జక్కవవలె కవ్వాకవ్వా మని విలపించుటను భావించుకొనినది. అన్నగారిముందు హృదయగత భావ ప్రాకట్యమునకు కూడ నోచుకొనలేదే మా నందుడు మరి.

ట్టలుగా మృగములుగా
ట్టుం డని శాపమిచ్చి పోగూడదా మే
స్టె జంటం బాయక
వెట్టుల గుట్టలను బట్టి జీవింతుముగా.

గౌతముడు మమ్ము పక్షులుగా బుట్టని శపించినను స్వేచ్ఛాయుత జీవితమై యుండెడివార మనియు ఈ

( తిరువాయి 6 పేజీలో )

# పోతన - భక్తికవిత్వావిర్భావము

– కుమారి ఎస్. అరుణకుమారి, ఎం. ఏ.

భక్తి కవిత అనునది ఒకటి కలదు. మామూలు కవిత్వం వేరు, భక్తి కవిత్వం వేరు కవిత్వానికి మూలము ఆనందము. కవిత్వము శబ్దార్థ ప్రధానమైనటువంటిది. యుక్తి ప్రధానమైనది. అనేకమైన లౌకిక విషయాలను కథావస్తువును చేసుకొని రచింపబడుతుంది. భగవంతుని అవగాహనకు తత్త్వ అవగాహన చేసికొనుటకు పీఠంగా ఉండేది భక్తి కవిత్వము. కేవల భగవదారాధన చేసికొనుటకు నిర్దేశింపబడినది. ఈ భక్తి కవిత్వము తెలుగులో ఎప్పుడావిర్భవించింది? సంస్కృతములో ఎట్లు ఆవిర్భవించినది?

వ్యాసుడు భారతమును రచించెను. ఇది భక్తి ప్రధానమైనది. ఇది మహేతిహాస కావ్యము. ఆనంద పడుటకు మారుగ శిరోవేదన నొందించినాడు. బదరీవనము నందు తిరుగు చుండగా నారదుడు సాక్షాత్కరించాడు. నారదుడు వ్యాసుని, 'యద్దేవా' చేయు చుండెను.

'అంచితమైన ధర్మపదము
మంచియు జెప్పితి వందులోన నిం
చించుక గాని విష్ణుకథ
లేర్పడ జెప్పవు ధర్మములే ప్రపం
చించిన మెచ్చునే గుణవి
శేషము లెన్నిన గాక నీవు నీ
కొంచెము వచ్చు టెల్ల హరిం
గోరి నుతింపమి నార్య పూజితా.
హరినామ స్తుతి సేయు కావ్యము సువ
ర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానస సర
స్సూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామ స్తుతిలేని కావ్యము విచి
త్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండదు యోగ్య దుర్మద నద
త్కాకోల గర్తాకృతిన్.

అనగా వ్యాసుడు తిరిగినాడు. శుక ముఖతః ఈ భాగవతం వినవన్న

'నిగమ కల్ప తరోర్గళితం ఫలమ్
శుక ముఖా దమృతద్రవ సమ్యుతమ్
... ... ... ...
నిగమములు వేయుఁ జదివిన
సుగమంబులు గావు ముక్తి
సుభగత్వంబుల్.
సుగమంబు భాగవతమను
నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా!

భాగవత ప్రాశస్త్యము తెల్పునటువంటి దీ పద్యము. శుక మహర్షి ప్రోక్తమైనటువంటిది. శ్లేషతో కూడినది. రసస్వరూపమును ఎరరవగా 'రసో వైసః' అని భాగవతము. ఇలాంటి భాగవత వాఙ్మయము తోడనే భక్తితత్త్వము ఏర్పడినది. ఇది భక్తి ప్రబోధమైన కావ్యము. అమృత ప్రవాహముతో వచ్చిన ఈ గాన అపశబ్ద దోషములను ఎవ్వరు లెక్క చేయలేదు

భక్తి కవిత్వము నన్నెచోడుని కుమార సంభవములో కలదు. పాల్కురికి సోమన భక్తి కవిత్వమును బసవపురాణములో చెప్పెను. ఇందు భక్తికి సంబంధించిన పారవశ్యమున్నప్పటికి అది అందరికి హృదయైక వేద్యమైనది కాదు. కేవలము శైవమతారాధనకు సంబంధించినది. కనుక ఇవి భక్తి ప్రధానమైన కావ్యములు కావు. కేవలము శైవమతావలంబన ప్రధానమైన కావ్యములు. అద్వైతులు కూడ ఆరాధింతురు. అందరికి ఉపాదేయమైనది భాగవతము. కాని పై రచనలు శైవులకు మాత్రమే ఉపాదేయములు. వీటిలో భేద భక్తి, అభేద భక్తి ఉన్నాయి. భాగవతము నందు భేదములేని భక్తి ఉన్నది. ఇది అందరు చదువుకొనెడి ఉపాదేయమైన కవిత్వము, తెలుగులో నూటికి నూరుపాళ్ళు భక్తి కవిత్వము ఉత్కృష్టమైన కవిత్వం.

పోతనామాత్యుని గజేంద్ర మోక్షము ఆంధ్రులకు నిత్య స్మరణీయము. పారాయణ ఘట్టము గజయూథ ప్రస్థానము మొదలు యూథపతి మకరిచే పట్టు బడు వరకుగల కథ మూలమున కలదు. గజేంద్రుని స్తుతి మూలానుసారముగానే యున్నది గాని ఆస్తుతిమాలకు మేరువో యనదగిన ఈ క్రింది పద్యమునకు మూలము లేదు.

'లావొక్కింతయు లేదు ధైర్యము విలో
    లంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్దప్పెను మూర్ఛవచ్చె తనువున్
    డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుగ మ
    న్నింపందగున్ దీనునిన్
రావే ఈశ్వర కావవే వరద సం
    రక్షింపు భద్రాత్మకా!'

ప్రాపన్న పరాయణుడైన వైకుంఠుని భూలోకమునకు తీసికొని వచ్చు ఈ పద్యము భక్తి పరాయణత్వమునకు పరమావధి.

భాగవతము శిల్ప భూయిష్ఠముగ ఉన్నప్పటికి దానిరచనా విధానము సర్వజనోత్కృష్టమైనది. ఇందు పోతన అపారమైన భక్తి భావమును చేకూర్చినాడు. అందువలన పోతన యొక్క భాగవతానికి అపారమైన గౌరవ భావన కలిగినది.

భక్తి కవిత్వ మనునది పోతనలో ఆవిర్భవించినది. భక్తి కవిత్వములో ముఖ్యమైన లక్షణం భక్త్యావేశము. ఇది అలౌకికమైన అపారశక్తి. ఈ భక్త్యావేశ విషయమున భాగవతకర్త కూడ చాలలేదు ఇతడు అసామాన్యుడైన ధీశాలి. ఎంత మేధావియో అంత హృదయ సంపద కలవాడు. కనుక భక్తి కవిత్వానికి హృదయ సంపద జీవము. ఈ భక్త్యావేశంలో అనేక అపశబ్దాలు అనౌచిత్యాలు రావచ్చు. తప్పు లేదు. దీనిని అలౌకిక దృష్టితో పరిశీలించవలెను. అవి ప్రవాహములో కొట్టుకొని పోయే గడ్డిపోచల వంటివి.

భక్తికి ప్రధానము నిరంతరము ధ్యానము చేసికొనుటయే. నవవిధములైన భక్తి మార్గంలో సంకీర్తనము ముఖ్యమైనది. పోతన కవిత్వవిధానములను సంకీర్తనలతో కూర్చి దివ్యముగా తీర్చిదిద్దాడు. మేధావియైన అరవిందుడు (ఎలో హెడ్) అతిమానస కవిత్వ మని తెల్పినాడు. ఇదియే జనతాసమ్మతమైన ఉత్తమ కవిత్వము. ఇదియే సహజమైన పాండిత్యము. సహృదయ పరనిర్వృతి ఈ భక్త్యావేశంలో మిక్కిలి సన్నిహితంగా ఉంటుంది.

— ... —

(5 వ పేజీ 1 వ కాలం తరువాయి)

వియోగమత్యంత దుర్భరమనియు భావించిన పట్ల కవులు చెప్పదలచుకొనిన భావమును చెప్పకయే కంటతడి బెట్టించ గల్గినారు.

'శోకరూపిణి యైన యశోధరాంబకీ తటిన్ తోడికోడలనైతి నేను' అని తనను తాను శోకదేవతగా నూహించుకొని యశోధరకు తోడికోలిగా నైతినని భావించినది. అంతర్గత వేదనను మనోహరమైన భావమున వ్యక్తపరచగలిగినారు. సుందరివేదన నందుని దీనాలాపములు చక్కగా వర్ణితములు. ఈ విధముగా నన్నయ మొదలుకొని ఈనాటి వరకు కవులు 'ఏడుపు' వర్ణనను తమ కావ్యాలలో చక్కగా వర్ణించినారు. పలువురు కవులు పలురకాలుగా ఏడ్పును వర్ణించి ఏడ్పు వర్ణన యందు సైతము రామణీయకమును సాధించి, కవులచేతిలో నేది యైనను మనోహరముగా మారు ననుమాట వాస్తవ మని ఋజువు పరచినారు.

—*—

# పురాణములు - భక్తి

- శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

**సంప్రదాయ భేదము :-**

ఉపనిషత్ప్రతిపాదిత భక్తిలో బ్రహ్మవాదమే కాని ఇష్టదేవతలకు స్థానము లేదు. అద్వితీయుడైన ఒకే ఒక్క బ్రహ్మను గూర్చిన ధ్యానము, మననము, జ్ఞానమార్గ సాధనములుగా పేర్కొనబడినవి. కాని పురాణముల కాలము నాటికి ప్రాచీన వైదిక యుగము నాటి దేవతలు మరల సాధకుని దృష్టి నాకట్టుకొనిరి. విష్ణు, శివ, శక్తి, సూర్య, గణపతుల నాధారముగా గొని వైష్ణవ, శైవ, శాక్త, సౌర, గాణాపత్య ఉపాసక సంప్రదాయము లేర్పడి, ఆమతములను పరిపోషించుటకై విభిన్న పురాణములు, ఉపపురాణములు, రూపొందినవి. ఇందు వైష్ణవ, శైవ, శాక్త మతములు మూడును విశేషమైన ప్రాధాన్యము నందుకొన్నవి. ఇవి భక్తిమార్గ ప్రాశస్త్యము నినుమడింప జేసినవి. సాధన విషయమున తమతమ సంప్రదాయములను బట్టి ప్రత్యేకమైన ప్రణాళికా పద్ధతులను రూపొందించినవి.

పురాణములందొక విశిష్టత గలదు. భక్తిమార్గమునకు సంబంధించిన ప్రత్యేక సాధనలను, భిన్నమత సంప్రదాయము లందలి విలక్షణతలను, విశేషములను వివరించుచునే 'మాలిః సత్యమొక్కటే' యను విషయమును మాత్రము విడువక పునరుద్ఘాటించుచున్నవి పురాణములు. భిన్నవిభిన్నమత సంప్రదాయము లందలి ఉపాసన పద్ధతులను, ఇష్టదేవతానిష్ఠను సాధకుని కందుబాటులో నుండునట్లు వివరించుచునే, ఉపాస్యమగు భగవత్తత్త్వము మాత్రము అభిన్నము, అద్వితీయము అను విషయమును మఱువక, దృఢపరచుచున్నవి.

శివ, విష్ణు స్వరూపములే కాని, తత్త్వము మాత్ర మభిన్న మని కాశీఖండము వివరించుచున్నది.

'యథా శివ స్తథా విష్ణు
ర్యథా విష్ణు స్తథా శివః।
అంతరం శివ విష్ణోశ్చ
మనాగపి న విద్యతే ॥'

ఈ విధముగా పురాణములు భగవత్తత్త్వమును, 'భిన్నత్వములో నేకత్వ' మనెడు మన సంప్రదాయమును వివరించుచున్నవి.

**వైష్ణవ భక్తి మార్గము :-**

విష్ణుభక్తి పురాణకాలము నాటికి ప్రచారము నందుకొన్నది. ఋగ్వేదము నందు విష్ణు సంబంధమైన సూక్తముల సంఖ్య ఐదారింటికి మించి లేదు. వేదములకు సంబంధించిన సంహితాయుగమున ఇంద్రునికే విశేషమైన ప్రాధాన్యముండెడిది. కాని కాలక్రమమున ఇంద్రుని ప్రాధాన్యము తగ్గుచు, విష్ణువు ప్రాధాన్యమధికము కాజొచ్చినది. విష్ణువు ఇంద్రునికి సఖుడని ఋగ్వేదమంత్రము లెడనెడ పేర్కొనుచున్నవి. 6.

పురాణకాలము నాటికి ఇంద్రుని స్థానములో విష్ణువు సుప్రతిష్ఠితుడైనాడు. విష్ణు సంబంధమైన విష్ణు, నారదీయ, గరుడ, పద్మ, బ్రహ్మవైవర్త, భాగవతాది పురాణములందు విష్ణుమహిమ విశేషముగా వ్యక్తీకరింపబడినది. విష్ణు పారమ్య ముగ్గడింపబడి, విష్ణువే పరమాత్మగా, ఆరాధ్య దేవతగా పూజింప బడినాడు. ఈ పురాణము లన్నింటను విష్ణువే పరతత్త్వమని సిద్ధాంతీకరింప బడినది. అట్టి విష్ణువు రామకృష్ణాద్యవతారరూపములలో కూడ పూజార్హుడైనాడు. రామ కృష్ణావతారము లాధారముగా భక్తిభావధార విశేషమైన పరిపుష్టి నందుకొన్నది. ప్రాచీన కాలమునుండి నేటి వఱకు యారాధన భావము, భక్తి, జ్ఞానదశ నుండి ప్రేమదశకు మారినది. భక్తిభావము ప్రేమమయమైనది.

భక్తి కేవలము ముక్తి మార్గముగాక ప్రేమ స్వరూపమై విలసిల్లినది. ప్రేమ స్వరూపమైన భక్తి సాధకుని హృదయమును తీవ్రముగ లోగొన్నది. భక్తుని జీవితమున భగవత్ప్రేమ వికాసము పరాకాష్ఠ నందుకొన్న అట్టి భక్తుడు మోక్షమును కూడ కోరక, నిరంతర భగవత్సేవా భాగ్యమునే అభిలషించును. భగవత్సేవలో పరమానంద భరితుడై, నిరంతర సేవానిరతుడై యుండునట్లొనర్పుమని ప్రార్థించును ఇట్టి పరమోత్కృష్టమైన భక్తిభావము శ్రీమద్భాగవతమున ప్రస్ఫుటమగుచున్నది.

"న కామయేఽన్యం తవ పాద సేవనా
దకించన ప్రార్థ్యతమాద్వరం విభో।"

'ప్రభూ! భక్తుడు ప్రార్థింపదగిన ఉత్తమోత్తమ మగు వరము నీ పాదసేవయే. దానిని వదలి, ఇతరములగు వరములను నేను ప్రార్థింపజాలను' అని యొక భాగవతుని యాత్మనివేదనము.

ఆధ్యాత్మిక సాధనమును తత్త్వము నుండి ప్రేమకు, ఆత్మనుండి హృదయమునకు, జ్ఞానమునుండి భక్తికి ప్రస్థానింప జేసినవి పురాణములు. సోఽహమ్మను అద్వైత మంత్రము కంటె 'దాసోఽహ' మ్మను ద్వైత భక్తి భావనమే విశిష్టమని పురాణయుగము నాటి సాధకులు నమ్ముచుండిరి.

అద్వైతమున కంటె ద్వైతమున కెక్కువగా అవకాశ మిచ్చినది వైష్ణవ భక్తి మార్గమే. ఈ వైష్ణవ భక్తి పురాణయుగము నాటి విశిష్టత.

నారద, శాండిల్యులు తమ తమ భక్తి సూత్రము లందు భక్తి స్వరూపమును, భక్తి లక్షణములను వివరించిరి. భక్తిని నిర్వచించిరి. పరమప్రేమరూపే భక్తి యని వారి

సిద్ధాంతము. కాబట్టి పరమమైన అనురక్తి యెట్లు కలుగునో. దాని స్వరూపమేమో విష్ణుపురాణము వివరించుచున్నది.

కర్మఫలము ననుభవించుటకై తాను వేయి జన్మలెత్తినను, అన్నింటను భగవానునియందు నిశ్చలమగు భక్తి భావము తన కుండునని, అవివేకి యగు వాని కెంతటి విషయ వాంఛయుండునో, నిరంతరము నామస్మరణము గావించు తనకు దైవమునందంతటి ప్రీతి యుండునని, దేవునియందు గల ఈ అచంచలమైన ప్రీతి తన హృదయమున కెన్నడును దూరముకారాదని భక్తుడు భావించును. విష్ణు పురాణమునందు ప్రహ్లాదుని ప్రార్థన ఇట్టిదే:

"నాథ ! యోని సహస్రేషు
యేషు యేషు వ్రజామ్యహమ్।
తేషు తేష్వచలా భక్తి
రచ్యుతాస్తు సదా త్వయి ॥
యా ప్రీతి రవివేకానాం
విషయేష్వన పాయినీ।
త్వా మనుస్మరతః సా మే
హృదయా న్నాపసర్పతు॥"

మానస్సును ఇంద్రియ సంబంధమగు కోర్కెలనుండి మరల్చి భగవంతుని యందు లగ్నము గావించుటయే ఉత్తమ భక్తియని గ్రహింపవచ్చును. భక్తి మార్గ సాధనను ప్రహ్లాదుడు పేర్కొనెను.

"శ్రవణం కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం
సఖ్యమాత్మనివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణోః
భక్తిశ్చే న్నవలక్షణా ॥"

జ్ఞాన వైరాగ్యములు భక్తి పరిపోషకములు. జ్ఞానము భక్తిని ప్రదీప్తము గావించును. వైరాగ్య భావనచే అంతరాత్మయందే పరమాత్మ దర్శనము సాధ్యమగును. జ్ఞానవైరాగ్యములతో కూడిన భక్తిని గూర్చిన ప్రశంస భాగవతమునందు కలదు.

'తచ్ఛ్రద్దధానా మునయో
జ్ఞానవైరాగ్యయుక్తయా।
పశ్య న్త్యాత్మని చాత్మానం
భక్త్యా శ్రుత గృహీతయా॥'

శ్రద్ధాళువులై వేదశాస్త్రముల నభ్యసించి, జ్ఞానవైరాగ్య సహితమైన భక్తిని సాధించిన మునులు ఆత్మదర్శనము గావించుకొన గల్గుచున్నారు.

భక్తిధర్మముల నాచరించు సమయములో సాధకుడు శాస్త్రవిహితమగు ధర్మమును స్థానమును నీతిని సాంఘికములగు కట్టుబాటులను, విధ్యుక్త ధర్మములను పాటింపవలయును.

వైష్ణవుడు మానవసేవయే మాధవసేవ యని గుర్తించుట వైష్ణవధర్మము. వైష్ణవ లక్షణములను పద్మపురాణము వివరించుచున్నది. భయార్తుడగు వాని కభయము, విద్యార్థికి విద్యాదానము, అన్నదానము, ఉదక దానము, దీనుల, రోగుల సేవ, ప్రజాసేవకై ఉద్యానముల నిర్మాణము, రావిచెట్టు నాటుట, గోసేవ, వైష్ణవ ధర్మములు.

'అభయం యే చ యచ్ఛన్తి
భీరుభ్య శ్చతురానన ।
విద్యాదానం చ విప్రేభ్యో
విజ్ఞేయాస్తే చ వైష్ణవాః॥
క్షుత్తృట్ ప్రపీడితేభ్యశ్చ
యే యచ్ఛ న్త్యన్న మంబు చ।
కుర్వ న్త్యే రోగి శుశ్రూషాం
జ్ఞేయాస్తే వైష్ణవా జనాః ।
ఆరామ కారిణో యే చ
పిప్పలారోపిణోఽపి యే।
గోసేవాం యే చ కుర్వన్తి
జ్ఞేయా స్తే వైష్ణవా జనాః॥'

దయాళువై ఉదాత్త మానవ ధర్మములను పాటించుట, సంఘములో పదిమందికి సాయపడుట భక్తుని లక్షణ మని, కర్తవ్యమని, అదే నిజమైన భక్తియని వైష్ణవభక్తి మార్గము సూచించుచున్నది.

శైవభక్తి మార్గము :-

పురాణయుగములో శైవ భక్తి కూడ ప్రచలితమైనది. శైవ పురాణములందు శివుడు స్రష్టగా, రక్షకుడుగా, సంహారకుడుగా అభివర్ణింపబడినాడు. వాయు శివ, లింగ, స్కాంద, కూర్మ బ్రహ్మాండాది పురాణములు శివ పారమ్య ప్రబోధకములు. పద్మపురాణోత్తర ఖండమున శివగీతలు, కూర్మపురాణాంతర్గతమగు ఈశ్వర గీతలు, శైవభక్తి మార్గమునకు సంబంధించిన విశేషములను పేర్కొనుచున్నవి. శివమాహాత్మ్యమును వివరించుచున్నవి.

శివ పురాణము ననుసరించి జ్ఞానమే మోక్షప్రాప్తికి ముఖ్యకారణము. జ్ఞాన ప్రాప్తికి సాధనము భక్తి. శివతాదాత్మ్యమే ముక్తి. అజ్ఞానమునుండి ముక్తిని పొందినప్పుడే సాధకుడు అహంకారము నుండి కూడ విముక్తుడు కాగలడు. అట్టి జ్ఞానియే శివతాదాత్మ్య రూపమైన మోక్షమును పొందగలడని శివపురాణము ప్రవచించుచున్నది.

'అజ్ఞానా ద్దూరతో భూత్వా
జ్ఞానవాన్ జాయతే యదా।
తదహంకార నిర్ముక్తో
యాతి శంకరతాం తు సః॥'

జ్ఞానము ద్వారా ముక్తిని సాధించు సోపాన పరంపరను శివపురాణము సక్రమముగా నిరూపించుచున్నది. సద్గురు కటాక్షముచే సత్సాంగత్యముచే శివ మహిమా శ్రవణము, ఇట్టి శ్రవణము వలన ప్రేమ కలుగును. ప్రేమయే భక్తిమూలము. శివభక్తి ఆత్మయోగమునకు ప్రేరణము, ఆత్మయోగము శివతత్త్వజ్ఞానమునకు సాధనము. జ్ఞానసంపన్నుడగు సాధకునకు మోక్షప్రాప్తి తథ్యము.

'జ్ఞానమూలం తథాఽధ్యాత్మం
తస్య భక్తిః శివస్య చ।
భక్తేశ్చ ప్రేమ సంప్రోక్తం
ప్రేమ్ణస్తు శ్రవణం మతం॥

శ్రవణస్య సతాం సఙ్గః
సఙ్గస్య చ గురుః స్మృతః।
సంపన్నేచ తథా జ్ఞానే
ముక్తిర్భవతి నిశ్చితం ॥

కూర్మపురాణాంతర్గతము లగు ఈశ్వర గీతలందును జ్ఞానభక్తి విశిష్టత చెప్పబడినది. జ్ఞానము ద్వారా తన్నారాధించు సాధకుడే తనకు ప్రియతమ భక్తుడని ఈశ్వర గీతా ప్రవచనము.

'సర్వేషా మేవ భక్తానా
మిష్టః ప్రియతమో మమ।
యోహి జ్ఞానేన మాం నిత్య
మారాధయతి నాన్యథా॥'

శివప్రాశస్త్యము వేదోపనిషత్తుల కాలమునను గలదు. రుద్రనామము నాటి వ్యవహారము. 'మంగళమయము, ప్రసన్నము పాపవినాశకము, నైన నీ సన్నిధికి మమ్ము జేర్చుకొమ్మని వేద ఋషులు 'రుద్రుని ప్రార్థించిరి. 8 శ్వేతాశ్వతరోపనిషత్తు శివుని ప్రాధాన్యమును వివరించుచున్నది. తన శక్తి చేత లోకములను నియమింపగల రుద్రునే బ్రహ్మవేత్తలు కోరుచున్నారని, సృష్టి, స్థితి, సంహార నిర్వాహకుడు 'రుద్రుడే' అని, శ్వేతాశ్వతర ఋషి రుద్రునే పరతత్త్వముగా స్తుతించెను. 9 ఇట్లు వేదోపనిషత్తులు ప్రతిపాదించిన రుద్రుని ఆలంబనము గావించుకొనియే పురాణములందలి శైవ భక్తిమార్గము నెలకొన్నది.

శివభక్తి విధానము శ్రవణ, కీర్తన, మననములను మూడు సాధనములను పేర్కొనుచున్నది. శ్రవణేంద్రియముల ద్వారా శివ మహిమలను విని, వాక్కుచే పరమేశ్వర గుణములను కీర్తించి, మనస్సుచే నిరంతర చింతన గావించుటయే సాధన.

'శ్రోత్రేణ తస్య శ్రవణం
వచసా కీర్తనం తథా।
మనసా మననం తస్య
మహాసాధన ముచ్యతే।'

శివపురాణమువిద్యేశ్వర సంహిత దీనినిగూర్చి ఇంకను విపులముగా చర్చించుచున్నది. స్త్రీసౌఖ్యము నెడ మానవుని మనస్సులో గల స్వాభావికమగు ఆసక్తి వంటిదే శివ విషయికములైన వచనములను వినుట యందు శ్రవణేంద్రియమున కుండవలయును. శైవసాధనలో దీనినే శ్రవణ మందురు. శ్రవణము నెడ ఆసక్తి ప్రాథమికము. మధ్యమదశలో కీర్తనము. అనంతరము శ్రేష్ఠమైనది, తురీయమైనది, మననము. శంకరుని ప్రతాప, గుణ, రూప విలాసములను సంగీతము ద్వారా, నామ సంకీర్తనముద్వారా స్తుతించు సాధనమే కీర్తనమున కనువుగ రూపొందును. మహిమాన్వితుడగు శివునిపట్ల ఆతడనురక్తుడై కీర్తనమునకు కడంగును. శ్రవణ కీర్తనములు మననమునకు మార్గము చూపును. సర్వేశ్వరుని నామ, రూప, గుణ, విలాసములను నిరంతరము చింతించుట శ్రేష్ఠమైన సాధనము. పూజ, జపము మున్నగునవి 'మననము' పేరిట ప్రసిద్ధమైనవి.

'యేనాపి కేన కరణేన చ శబ్ద పుంజం
యత్రక్వచి చ్ఛివపరం శ్రవణేంద్రియేణ।
స్త్రీకేళివద్దృఢతరం ప్రణిధీయతే యత్
తద్వైబుధాః శ్రవణ మత్రజగత్ప్రసిద్ధమ్॥
గీతాత్మనా శ్రుతిపదేన చ భాషయా వా
శంభుప్రతాపగుణరూప విలాసనామ్నాం।
వాచాస్ఫుటంతురసవత్ స్తవనం యదస్య
తత్కీర్తనం భవతిసాధనమత్ర మధ్యం॥
పూజాజపేశ గుణరూప విలాస నామ్నాం
యుక్తి ప్రియేణ మనసా
పరిశోధనం యత్।
తత్ సంతతం మనన మీశ్వర దృష్టిలభ్యం
సర్వేషు సాధన పరే ష్వపి
ముఖ్య ముక్తమ్॥'

ఇట్టి క్రమమైన సాధన వలన శివయోగ భావనా నిరూఢహృదయుడై, సాధకుడు ముక్తిపదవి నందుకొనగల్గునని శివపురాణము చాటుచున్నది.

'ఏవం మనన పర్యంతే
సాధనేఽస్మిన్ సుసాధితే।
శివయోగో భవేత్తేన
సాలోక్యాది క్రమా చ్ఛనైః॥'

శివుని కృపను పొందినవానికి శివభక్తియోగము సాధ్యము. భక్తిగలిగిననే దైవకృప లభించునని మన నమ్మిక. ఈ సంశయమును నివారించి, దైవకృప, దైవభక్తి పరస్పరాశ్రితము లని శివపురాణము వివరించుచున్నది. అంకురము నుండి బీజము, బీజమునుండి అంకురమువలె దైవానుగ్రహముచే భక్తియు, భక్తిభావనచే దైవకృపయు సంభవించును.

'ప్రసాదా ద్దేవతాభక్తిః
ప్రసాదో భక్తి సంభవః।
యథే హాంకురతో బీజం
బీజతో వా యథాంకురః॥'

శివుని యనుగ్రహ మనన్యసామాన్యము. దైవానుగ్రహము గల్గిన పతితునకైనను, మూర్ఖునకైనను, పండితునకైనను ముక్తి లభ్యము. శివభక్తుడు అయోగ్యుడే అయినను, కరుణామూర్తియగు పరమేశ్వరుడు వాని పాపములన్నింటిని నాశము గావించి, వానికి ప్రసన్నుడగుచున్నాడని శివపురాణము పేర్కొనుచున్నది.

'పతితో వాఽపి ధర్మాత్మా
పండితో మూఢ ఏవవా।
ప్రసాదే తత్క్షణా దేవ
ముచ్యతే నాత్ర సంశయః॥
అయోగ్యానాం చ కారుణ్యాత్
భక్తానాం పరమేశ్వరః
ప్రసీదతి న సందేహో
నిగృహ్య వివిధాన్ మలాన్॥'

పతితులు సైతము పరమేశ్వరానుగ్రహమును బడయజాలుదు రని సప్రమాణముగా నిరూపించుచు, ఆధ్యాత్మిక సంపద కొందరికే పరిమితముకాక, యెల్లరకును అని చాటుటకే మనపురాణములు.

(సశేషం)



దాశరథి కవిత :

# ఆలోచనాలోచన కాంతిపథంలో మహాకవి దాశరథి మానవతాపథం!!

- శ్రీ డా॥ జి. బి. ఎన్. ఆచార్య, ఎం. ఏ, పిహెచ్. డి.

'ఈ భయంకర బాధామయధాత్రి
ఇక ప్రియకరం కాతుంది ఈరాత్రి;
వ్యాపిస్తున్న నవకాంతి జ్వాలలు
అవి మానవతా మందార మాలలు!!'

అని, ఆలోచనాలోచన కాంతి పథంలో తాను పయనిస్తూ, మనను కూడా ఆహ్వానిస్తున్న మహాకవి దాశరథి - తన నవ కవితా మందార మాలలను శ్రీ జలగం వెంగళరావుగారికి అలంకరించాడు. ఇది దాశరథి ఆప్యాయతకు పతాక. వెంగళరావుగారి ఆనందానికి ప్రతీక. వీరిద్దరు చిరకాలమిత్రులు అని అంటే కేవలం చాలదు. ఒకరి కొకరు ప్రాణంలో ప్రాణం; గానంలో గానం. ఇప్పటివరకు దాశరథి ఆర్జించిన, ఇక ముందు ఆర్జించుకోబోతున్న కీర్తి వెనుక జలగం వారి మూర్తి ప్రజ్వలిస్తూనే వుంటుంది. నిరంతరం దాశరథి వెన్నును, పెన్నును తట్టి లేపుతూ ఆయన విప్లవకవితా జీవితానికి స్ఫూర్తినిచ్చిన. ఇస్తున్న శ్రీ వెంగళరావుగారు ఈ కావ్యాన్ని స్వీకరించటానికి ఎంతో అర్హుడు. అయినా దాశరథి ఇంకా ఇంకా ఆయనకు ఋణపడే వుంటాడు.

ప్రజల్లో తిరుగుతూ, ప్రజాసమస్యలను అవగాహన చేసుకుంటూ, వాటికి పరిష్కారమార్గాన్ని అన్వేషిస్తూ, తన కవితా కిరణాలతో వెన్నుతట్టి లేపుతూ 'జాతి' కేతను, తన కవిత్వము అంకితమైపోయిన ప్రజాకవి దాశరథి - మహాకవి. ప్రజలతోడిదే ఆయనలోకం. ఆయనవెంటే ప్రజల నిరంతరపయనం. దాశరథి ఈ సమాజం అణువణువులోకి చొచ్చుకుపోయాడు. కనుకనే -

'వీథిజీవితం, వ్యథాజీవితం
విషాదగాథాకలిత జీలితం.'

అని 'వీథిమానిసి' స్వీయగాథను తాను విని, మనకు వినిపించ గలిగాడు. స్వాతంత్ర్యం వచ్చిందని మామూలుగా అందరూ సంబరపడిపోయి, భారీఎత్తున ఉత్సవాలు, ఊరేగింపులు చేసుకుంటుంటే ఆయనకు నచ్చలేదు. పేరుకు స్వాతంత్ర్యం వచ్చినా, మనం సాధించాల్సింది ముఖ్యమైనది మరొకటుంది. అది సాధించేవరకు మానజాతికి పండుగే లేదు. అసలు ఇప్పుడు మనకు లభించిన స్వేచ్ఛ కాదు మనకు కావల్సింది. పనిచేసి, ఫలితమంతా పదిమందీ పంచుకునే స్వేచ్ఛ మనకు కావాలి. ఇంకా -

తిన తిండిలేనివాడు
కనిపించ బోనివాడు
ఆర్జించుకున్న స్వేచ్ఛ
అసలైన స్వేచ్ఛ యగును.'

అని దివ్యసందేశాన్ని అందించాడు. సామ్యవాదమే ఆయన లక్ష్యం, సమసమాజమే ఆయన ధ్యేయం, అవి సాధించిన నాడే - మనస్వాతంత్ర్య మాసం అవుతుంది భరతాంబహాసం. అప్పుడే ఆ సేతు శీతనగమూ జనతా విలాసం దర్శన మిస్తుంది. శాంతియుత ప్రయోజనాల కోసం అణువును భేదించి, భారత కీర్తిని దశదిశల వ్యాపింపజేసిన శాస్త్రజ్ఞులను ప్రశంసిస్తూ -

'పిచ్చివాడు అణువును
ఆయుధంగా వాడు తాడు
మంచివాడు అణువును
నేస్తంగా మలచగలడు.'

అనే మానవతా సందేశాన్ని అందించాడు.

అణువుతో ఔషధాలు
అణువుతో రథాలు
అణువుతో అతినూతన పథాలు
ఆ చిరకాలంలో కల్పిస్తాం.'

అని - అణువును అభ్యుదయానికి సాధనంగా వాడుకోమని, వాడుకోవాలని ఆశాపూరితమైన 'అణుగీతి'ని వినిపించి అణుయుగ వైశిష్ట్యాన్ని వెల్లడించాడు అభ్యుదయ కవిత్వానికి ఆశ పునాది. అందుకే -

'హింసా, రక్తపాతం
ఇంకా జరుగుతున్నా
ఎన్నటికైనా అవుతుంది
ఈ జగన్నాటకం సుఖాంతం.'

అని దాశరథి అభ్యుదయకవితాసౌధాన్ని నిర్మించాడు. నాటిమనిషిని బ్రతికించుకోలేని చచ్చు బ్రతుకుపై దాశరథికి ఎంతో విరక్తి. అందుకే -

'ఈతుషార యవనికనుచించి
కృశాను కీలిక గా రగిలించి
వజవజ వణికే అవ్వను
గజగజలాడే గువ్వను
రోగిని
బైరాగిని
నిరుపేదరాలిని
విశ్వశ్రామిక జనాలిని
కాపాడుకుంటాను.'

అని క్రాంతి గీతిని పాడుకొన్నాడు. తన ఆశల రవ్వలవేడగా 'తుషారక్రీడ' ను సలుపుతున్నాడు. రెండు చీకటికొండల మధ్య, నిండైన కాలప్రవాహంమీద వెలుగులవంతెన' ను నిర్మించుకొని, అనంతయానం సాగిస్తున్న దాశరథికి - ఉగాది పంటల్లో ఆకలి మంటకే కనిపించాయి. అందుకే -

'గజదంత గోపురం
లో కాదు కాపురం;
కార్మికులు గలపురం
కవికి అంతఃపురం

అంటూ తననివాసస్థలం ఎక్కడో నిశ్చయంగా చెప్పాడు. అంతటితో తృప్తి పొందక తన ప్రయాణాన్ని ఆపుకోక–

'క్షామం అంతరించాలి.
సమృద్ధి సాధించాలి

అనే దీక్షతో ముందుకు సాగుతున్నాడు. క్షామం అంతరించి, సమృద్ధి సాధించి లోకకల్యాణం జరిగినప్పుడే దాశరథి ప్రయాణానికి విరామం కలుగుతుంది.

'రెండు కళ్ళు, చూపు ఒకటి
రెండుకాళ్ళు నడక ఒకటి
కలసి నూర్చుని ము । మంథరము
కలతలు తొలగించు కుందాము.'

అని ఐకమత్య శుభగీతాన్ని వినిపిస్తూ, విశ్వజనాళికి ఏకతాసందేశాన్ని అందించి, ప్రజల గుండెల్లో శాంతి చంద్రికలను కురిపించిన కవి చంద్రుడు దాశరథి–

'కుళ్ళురాజకీయాల ముళ్ళకౌగిలి
సడలి తెలుగు జాతి అవుతుంది
పూలలోగిలి.'

అని ఆశించాడు. ఆయన ఆశించిన పూలలోగిలి కోసం తెలుగు జాతి నిరంతరం కృషి చేయాలి. ఆశయాన్ని సాధించాలి, ఆసాధన కోసం–

'అనురాగపు విరజాజులు విలసిల్లాలి
హృదయంతో సౌగంధ్యం వెదజల్లాలి
మధుమాస ప్రథమోదయ మంగళవేళ
సౌహార్దపు విరితేనెజల్లు పడాలి.'

అనే విషయాన్ని ఈతరం, ఈజనం గ్రహించి, నవజీవనవికాసాన్ని పొందాలి.

అజంతా పాలరాతి విగ్రహాలకళ్ళల్లో కాంతిని, ముఖాల్లో శాంతిని దర్శించిన నవకళామూర్తి దాశరథి 'అంతర్దర్శనం' అఖిల జగత్తుకు ఆదర్శ ప్రాయం. కొవ్వొత్తితో పాటు తానుకూడ కాలిపోగలననే త్యాగసౌశీల్యాన్ని ప్రకటించిన దాశరథి అనంతలోకానికి ఆదర్శమూర్తి చీకటి గుండెలను చీల్చే కిరణాల ఛురికలతో లోకంలోకి దూకే లోకబాంధవుని నయనాల్లోకి తదేక దీక్షగా చూడగల దాశరథి కవిత సామాన్యమైనదికాదు! ప్రజారుజాగ్రస్త హృదయాలకు అమృతధార.

చదువుకై ఇల్లూవాకిలి అమ్మిన అమ్మానాన్నలకు పట్టెడన్నం పెట్టలేని పరమ దరిద్రుడైన పట్టభద్రుణ్ణి–

"భద్రతలేని పట్టభద్రుడు
'శాంతి'. 'సహనం' అర్థం తెలియని
భగ భగమండే నవయుగరుద్రుడు".
నక నకలాడే నవయుగరుద్రుడు.

అని తీవ్రాతి తీవ్రంగా చిత్రించాడు. బ్రతుకు తెరువు చూపించలేని చదువుల్లూ, డిగ్రీలూ వ్యర్థమని విమర్శించాడు. ప్రజాస్వామ్యం, సామ్యవాదం అంటూ వల్లిస్తే చాలదు. వాగ్దానాలతో, నినాదాలతో స్వర్గం నేలకు రాదు. అస్తవ్యస్తమైన ఆర్థిక వ్యవస్థ మారకపోతే మనిషికి అవస్థ తప్పదు. వర్గభేదమూ, నిరుద్యోగమూ, పరపీడనమూ పోవాలి. ధనస్వామ్యం అంతరించి జనస్వామ్యం అవతరించాలి. అప్పుడే జనావళి తరిస్తుంది, అందుకు–

"శ్రామిక వర్గం కదలాలి
యువతీయువకులు ఈసమరంలో
నవనాయకులై నిలవాలి.

అని ఉత్తేజకరమైన సందేశాన్ని వినిపించి దాశరథి ప్రస్తుత వ్యవస్థపై తిరుగుబాటు చేసాడు. దాశరథి ఆశించిన నూతన వ్యవస్థకోసం ప్రతివ్యక్తీ కృషి చెయ్యాలి. ప్రయత్నిస్తే సాధించలేని దేదీ వుండదు. ఈభావాన్నే ప్రోత్సహిస్తూ–

'నవబాష్ప ధారలో నవ్వు కాగలవు
ముళ్ళతీగెలలోన పువ్వు కాగలవు
యత్నించి చూడమని అంటాను నేను
రాళ్ళరాసులలోన రవ్వ కాగలవు.'

అని మానవతా శక్తిని కొనియాడాడు. మానవజాతి మనుగడకు 'శాంతి' ఒక్కటే శరణ్యమని చెపుతూ–

'రక్తం నదులై పారకపోతే
రాదా రెవల్యూషన్?
బుర్రలు బుర్రలు పగులక సమస్యకు
లేదా సొల్యూషన్?
హింసా, యుద్ధం ఔట్ డేటెడ్
అని నేనంటాను–

శాంతిఒక్కటే మానవజాతికి సరియగు సొల్యూషన్. అని శాంతి సందేశాన్ని అందించాడు. వీలైతే ప్రణయాన్ని పెంచమన్నాడు. కాని ప్రళయం దించటం ఘోరమన్నాడు. మనసైతే మల్లెలు విసరమన్నాడు. కాని రాళ్ళను రువ్వవద్దన్నాడు. అడిగితే దారి చూపమన్నాడు. కాని పెడదారి చూపటం తగదుసుమా! అని హెచ్చరించాడు ఈ హెచ్చరికలో, అభ్యర్థనలో దాశరథి వ్యక్తిత్వం, కవిత్వతత్త్వం ఎంత శాంతియుతమైనవో తెలుస్తున్నవి.

'విప్లవం అంటే అర్థం తెలియనివానికి
పిస్తోలు పట్టిన వాడే విప్లవవాది
విప్లవం అంటే అర్థం తెలిసినవారికి
పిస్తోలుకు గురియైన వాడే విప్లవవాది'.

అని గాంధేయవాదం ప్రకారం విప్లవమంటే యేమిటో తెలియజేసిన దాశరథి–

'నా జాతి గతజీవితాన్ని
వర్తమాన కాలంతో కూడి
భవిష్యత్తుతో హెచ్చవేసిన
పక్కా లెక్కలమేష్టారు
ఆ బోసినోటి మహాత్ముడు.'

అని విశిష్టంగా గాంధీమహాత్ముని ప్రశంసించారు. తరతమ భేదాలు మరిచిపోయి, తల్లిపూజకు తరలి రండని అందరినీ ఆహ్వానించిన దాశరథి–

'కలాన్ని జండాకర్రగా
కవితను కాంచనపతాకగా
గగనాంచలాల ఎగరేస్తూ'

పయనించే పథికుడు; భవ్యభావనా రథికుడు. ప్రజాహృదయ మాలికలు పులకించే విధంగా, కాంతికన్యలచేత ప్రగతి గీతికలు పాడించి, ప్రభానృత్యములు ఆడించి, తామసప్రకృతినే హతమార్చిన

శాంతివీరుడు దాశరథి - 'శాంతి' నా పక్కనుంటే రోజూ సంక్రాంతి అని పరవశత్వంతో క్రాంతిగీతాన్ని పాడాడు. నవచైతన్యం పొంగే యువకులకు, మిత్రులకు-హింసను నేర్చి ధ్వంసం కావద్దని హెచ్చరిక చేసాడు. ఏదో ఒకదేశంలో, ఎప్పుడో ఏదో అయితే అలాగే మనదేశంలో అవాలని అనకూడదు. మేధావికసమునకై మేటికృషిని చేసి, ప్రజలసమస్యలను తెలిసి ప్రవర్తించాలి. హింసాత్మక బుద్ధితో పాతప్రపంచం వైపు పరుగుతీయ దలచకూడదు. బాంబులతో సాధించటం కాదు-విప్లవాన్ని హృదయాల్లో సాధించాలి. ఇది దాశరథి విప్లవతత్త్వం. ఈ తత్వాన్ని బాగా ఆకళింపు చేసుకొని, ప్రవర్తిస్తేనే మానవజాతి శాంతి కాంతులను నింపుకోగలుగుతుంది.

'మన శాస్త్రజ్ఞులు కావించే
మహిమాన్విత ప్రయోగాలు
మానవాళి కంతటికి
ఆనంద సంధాయకాలు'

కావాలన్నదే దాశరథి ఆకాంక్ష, ఈ కాంక్షలోనే అభ్యుదయం రూపు దిద్దుకుంటుంది.

బహుముఖ ప్రజ్ఞావంతుడైన దాశరథి శాంతి సమర యోధుడు. విప్లవానికి సముచితమైన వ్యాఖ్యానం చేసి, విప్లవమంటే రక్తపాతంకాదని హితబోధ చేసిన కవిదేశికుడు దాశరథి-ఏఅంశాల్ని వస్తువుగా గ్రహించికవిత్వాన్నిరచించినా'శాంతి'ని బోధించటమే ఆయన లక్ష్యం. అగ్నిధారను కురిపించినా, రుద్రవీణను వినిపించినా, మహాంధ్రోదయగీతికను ఆలపించినా, కవితాపుష్పకంలో విహరించినా ఆయన ఆలోచనాలు ఎప్పుడూ 'శాంతి'నే దర్శిస్తాయి. ఆయన లేఖిని ఎప్పుడూ 'శాంతికవితల' నే సృష్టిస్తుంది.

—···—

# కవిగా అప్పకవి ప్రతిభ

- శ్రీ కే. కిశోరుబాబు, ఎం. ఏ.
- శ్రీ కే అశోకబాబు, బి ఎస్ సి. (అగ్రి)

(గతసంచిక తరువాయి)

హిందువుల వివాహవిధి యందు వరుడు వధువు యొక్క వామపాదమును పట్టుకొని సన్నికల్లుపై త్రొక్కించు నాచారమున్నది. దాని గౌరీకల్యాణ ఘట్టమునందుగూడా ప్రవేశపెట్టి కవులు కలితములైన కల్పనల నొనరిస్తూ ఆయమను భక్తితో ప్రార్థిస్తూ చిన్ని పువ్వు లర్పించినారు. శంకరాచార్యుల వారు తుహినగిరివంశధ్వజపటమైన దేవిని స్తుతిస్తూ నీమీగాళులు కఠిన కమఠీకర్పర తుల్యములని సజ్జనులు వర్ణిస్తున్నారు గాని అటువంటి వాటిని మరి వివాహ సమయమున శివుడు చేతితో పట్టుకొని రాతిపై (సన్నికల్లుపై) ఎటులుంచినాడో అని వర్ణించినాడు.

పదంతే కీర్తీనాం
ప్రపద మపదం దేవి, విపదాం
కథం నీతం సద్భిః
కఠిన కమఠీ కర్పరతులాం
కథం వా పాణిభ్యా
ముపయమన కాలే పురభిదా
యదాదాయ న్యస్తం
దృషది దయ మానేన మనసా.
(సౌందర్యలహరి 83 వ శ్లోకము)

నీలకంఠ దీక్షితులవారు దేవి పాదస్పర్శ హృదయములో తగుల వలయునన్న యుత్కంఠను ప్రదర్శిస్తూ ఓవిశ్వజననీ నామనస్సు కోమలమైన దగుచో అది మృదువులైన నీచరణములకు పాదుక యగుగాక. కఠినమైన గోడల నీవు శంకరుని కరగ్రహణ మొనర్పనపుడు రాతిని త్రొక్కించు విధమందుపయోగపడును గాక. అని అను కంపకలుగు నట్లుగా అంబను అర్థించినాడు.

స్యాత్కోమలం యదిమనో
మమవిశ్వమాత
స్తత్పాదయోర్మృదుల యో
స్తవ పాదుకాస్తు
స్యాత్కర్కశం యదికర
గ్రహణోత్సవే
దశ్మాధిరోహణ విధా
భవతూపయోగః
(ఆనందసాగర స్తవము)

అప్పకవి గూడ సన్నికల్లును ప్రస్తావిస్తూ 'అమ్మలగన్న యమ్మను' ప్రస్తుతించినాడు

పరిణయవేళ యందు దన
పాదముబట్టుక సన్నెకంటిపై
దిరముగ మోపి కంతునకు
దీరె గదా పగ యంచు నీలకం
ధరుడు దరస్మితుండగుట
దద్వలయాహిఫణాగ్రరత్నసం
దరముకురంబునం గని యె
దన్మద మందు భవాని గొల్చెదన్.

(అప్పకవీయ పీఠికా భాగములో 41వ పద్యము తనపాదమును పట్టుకొని సన్నెకంటిపై మోపి మదనునిమహిమ అపారము, అతని జయించుట అసాధ్యము. జగదేకమోహనుడు మధుపగుణచాపనాథుడు, మనసిజుడు అగు అతనికి నావంటి ఉగ్రుడుకూడా దాసోహ మనక తప్పినదికాదు. చివరకు విజయము అతనినే వరించినది. అతని పగ కూడాతీరినది అని మనసున తలచుకొనుచు ఎలనవ్వు నవ్వుచున్న పరమశివుని తోరంపు మూర్తిని అతని యొక్క సర్పకంకణ ఫణాగ్ర రత్న దర్పణమునందు గాంచి పార్వతి మనసు పులకింతలతో దువాళించుచున్న దట. పార్వతీ పరమేశ్వరుల తుర్య ప్రకృతులను తురగలింప జేయు పొడవైన వర్ణన మిది.

రామరాజ భూషణుని యెడల వైమనస్యము ప్రకటించినను అతనికి ఈపద్యములోని 'సన్నికల్లునకు' ప్రేరణ మిచ్చినది.

వసుచరిత్రలోని

శ్రీ భూపుత్రి వివాహవేళ నిజముం
జీరాగ్ర రత్న స్థలీ
లాభిఖ్యక్తి వరాంఘ్రి రేణు భవక
న్యాలీల యంచు న్మదిం
దాభావింప శుభక్రమాకలనచే
దద్రత్నముం గప్పునీ
తాభామాపతి ప్రోచుతం దిరుమలేం
ద్ర శ్రీమహారాయనిన్.
(వసుచరిత్ర 1-1)

అను పద్యమే అనవచ్చును. వివాహవేళ సీతాదేవి తన తులాకోటియగ్ర రత్నము నందు ప్రతిబింబమును గని అది శ్రీరామ పాదస్పర్శనమువలనజనించినకన్యావిలాస మనుచుభావించుచుండగా సన్నికల్లుద్రొక్కించు నెపముచేత మంజీరముఖస్థమగు రత్నమును మాటుపరచి శ్రీరామచంద్రుడు సీతాదేవి భ్రాంతిని పారద్రోలినాడట. అప్పకవి పద్యమునందు పార్వతి పరమశివుని పన్నగకంకణ ఫణాగ్రరత్న దర్పణమునందు అతని రూపమును గాంచి హసించినది. రామరాజ భూషణుని పద్యమునందు సీతాదేవి నిజమంజీరాగ్రరత్నమునందు ఛాయను గాంచి రాముని పాద స్పర్శనము వలన ఉద్భవించిన కన్యాలీల యనుచు భ్రమించినది సన్నికల్లుపైని పార్వతి పాదమును మోపిన అప్పకవి శివుడు కంతుని స్మరించినాడు. సన్నికల్లును ద్రొక్కించి రామరాజ భూషణుని శ్రీరాముడు సీతాదేవి భ్రాంతిని దూరము గావించినాడు. అందెయందలి రత్నమున బింబమును పరికించి అది శ్రీరామచంద్రుని పాదస్పర్శనమువలన జన్మించిన కన్నియ యని సీతాదేవి భ్రమించిన దని రామరాజ భూషణుడు వర్ణించిన భావమునకు మూలాధారమైనది తిమ్మన పారిజాతాపహరణమున కనిపించుచున్నది. అది పార్వతీ పరమేశ్వర వివాహ వర్ణనరూప మగు శివస్తుతియందున్నది.

పొలతుల్ గౌగిట గ్రుచ్చి యెత్తి తలబ్రా
లోయించు నవ్వేళ నా
దల గంగం దననీడ జూనకని మా
ర్గవ్యంబొప్ప వేఱొక్క తొ
య్యలియంచున్మది నెంచు పార్వతియసూ
యాహాప్తికిన్నవ్వ కొ)
న్నెలపూదాలుపు కృష్ణరాయునికి సం
ధించు న్మహైశ్వర్యముల్
(పారిజాతాపహరణము 1-2)

చెలికత్తెలు కౌగిట జిక్కబట్టి పార్వతీదేవి చేత తలంబ్రాలు వేయించువేళ శివునికపర్దము నందలి మందాకిని సలిలమున ప్రతిఫలించిన తన ప్రతిబింబమును గాంచి మరియొక కాంతామణి యను భ్రాంతిచే పార్వతి ఈసుచెందుచుండ పరమశివుడు హసించుచున్నాడట. నందితిమ్మన గంగయందు తన నీడను గాంచి గౌరి మరొక యువతి యని భ్రమించి అసూయ పడిన దని వర్ణించగా రామరాజ భూషణుడు దానిని సీతాదేవి తన హంసక రత్నము నందుగని రఘుపతి పాదస్పర్శమహిమ యని భ్రమించిన దని వర్ణించినాడు. తిమ్మన తలంబ్రాలువోయు వేళయని పేర్కొనగా రామరాజ భూషణుడు దానిని సన్నికల్లు ద్రొక్కించు వేళ యని వర్ణించినాడు. అప్పకవి వీరిరువురి పద్యములను పరిశీలించి యుండవచ్చును. తలంబ్రాలువోయు వేళ యను తిమ్మనగారి భావమును పరిణయవేళయని అప్పకవి మార్చినాడు దానికి రామరాజ భూషణుని 'శుభక్రమాకలనచే' అనునది జోడించి అది సన్నెకంటిపై మోపి అని అచ్చ తెలుగులోనికి అనువదించినాడు

తిమ్మన పరమశివుని జడల యందలి గంగలో నీడ కన్పించిన దని పాదకటక రత్నమున ప్రతిబింబించిన దని, పేర్కొని నాడు. అప్పకవి దానిని పరమశివునిఅహిఫణాగ్రరత్న ముకురంబునందు గనిపించిన దనివర్ణించినాడు మొత్తముమీద ముగ్గురు కవులు తెలుగు వారల పెండ్లి పద్ధతులను దేవతలచేత గూడా ఆచరింపజేసి సాహిత్యప్రియులకు సంచదార గలిపిన పాలవంటి తియ్యటి పద్యముల నందించినారు.

బాలగణపతి చిన్నారిపొన్నారి చిలిపి చేష్టలను కొండాడటము తిక్కనకేతనల కాలము నుంచి కనిపిస్తున్నది. అప్పకవి గూడా తల్లిదండ్రులకు ముద్దుగూరుస్తూ ముద్దుల నందించే గజాస్యుని అభీష్టసిద్ధి కొరకు ప్రార్థించినాడు.

తనుగని యెక్క రొత్తునని
దనుజయున్నిటలాక్షుడు న్మదం
బుననిరు చెక్కులం గరసి
ముద్దుగొనంగ నొకింత నెమ్మొగం
బునువుగ వెన్కకుం దిగిచి
యత్నవిహీన పరస్పరాస్యచుం
బనములు దల్లిదండ్రులకు
బన్నుగగూర్చు గజాస్యు నెన్నెదన్
(అప్పకవీయపీఠికా భాగము 22వపద్యము)

హేరంబుని వాహనమగు ఎలుక పరమశివుని మకుట భూషణమగు సర్పమును గాంచి భయపడి వెనుకకుం దగ్గగా, తన వాహనమగు మయూరమును ఉసిగొలిపి దాని భీతిని నివారించుచు కుమారస్వామి తన అగ్రజునకు ప్రీతిని చేకూర్చుచున్నాడట. కార్తికేయుని భజిస్తూ అప్పకవి అందమైన ఊహయొనరించినాడు.

జనకుని గొల్వవచ్చు నల
చామర కర్ణుని తేజి నందివా
హనుముకుటాహిగాంచి భయ
మంది పిఱిందికి బోవ జూచినం
దనశిమావు దీకొలిపి
దానిభయంబు హరించి పూర్వజా
తునకు ముదం బొనర్చు గుహు
దుగ్ధర శక్తి వహు న్భజించెదన్.
(అప్పకవీయ పీఠికా భాగము 28వపద్యం)

అప్పకవికి ఉత్ప్రేక్ష లనిన మక్కువ యని అతను గావించిన ఈస్తుతులన్నింటి వలన తెలియుచున్నది.

తెలుగు పలుకుబడి పొలుపును వెలార్పచు తనకు స్వప్నమున గనిపించిన పయో

రుహాపత్ర) నేత్రుని స్వభావోక్తిలో సొగసుగా వర్ణించినాడు.

మిగుల జేతుల వెంట మేటిశంఖంబును
  బుట్టు వెగుపవయును బట్టువాడు
ముద్దుల గుమ్మలౌ ముద్దియ లిద్దరు
  కైదండలిడ నీటుగలుగువాడు
బంగారు చెఱగుల పచ్చని హొంబట్టు
  దుప్పటి యొల్లివాటొప్పువాడు
హారకేయూరమంజీర కోటీరాది
  భూషణంబులు చాల బూనువాడు
నుదుట గస్తూరి తిలకంబు నొదలువాడు
తలచి చూచిన నాకుల దైవ మగుచు
బోలుచు నాకుల దైవంబు బోలువాడు
నిలిచె నొకరుడు నాగుముంగలను గలను.
(పీఠికా భాగము 3రవ పద్యము)

తన తాత సోమయ సోముని (శివుని) కంటె ఉన్నతుడని రవపాళము వంటి, రవసాకులవంటి పలుకులతో రమ్యముగా వర్ణించినాడు.

ఒకని వాకిలిగాచియుండ డెన్నటికైన
  నుగ్రుడుగాడు దానొక్కనాడు
కంటమంటలు రాల గనుగొన డెవ్వరి
  నెర డెన్నటికిని నీరుమోవ
గుత్తుకందు విషంబు గూరిచి వర్తింప
  డనిశంబు పరులను నడగికొనడు
సంతతంబును బౌరుషముత్పత్తి గాంచడు
  క్రతువులు దా జేయుగాని చెఱుపడు
(పీఠికా భాగము 78 వ పద్యము)

కృష్ణదేవరాయల తండ్రి ఈశ్వరమహారాజు ఈశ్వరునికంటె ఉత్కృష్ట గుణములు గలవాడని నంది తిమ్మన

'తామసవృత్తి లేదు, సత
  తంబును నుగ్రుడుగాడు పౌరుషం
బేమియు వెత్తిగాదు, తన
  కెందును బైమతిరాజు లేదు సం
గ్రామములోన నొక్కనరు
  గానికి వాసిదొరంగ డీశ్వర
క్ష్మామహిళా మనోహరుని
  సాటియె యీశ్వరు డెన్నిభంగులన్.
(పారిజాతాపహరణము 1_9)

అని వర్ణించినాడు. తిమ్మనగారి ఒరవడిలోనే అప్పకవి తన తాత సోమయ వైభవమును వెల్లడిగావించినాడు.

సోముని నందనుడు 'వెంగన' బుధుడన నెగడె, జగంబున సోముని నందనుండు బుధుడగు టరుదే అని సొగసుగా చమత్కరించినాడు.

రఱల సాంకర్య మొనరించినాడని పోతనను తిరస్కరించినను కవిస్తుతియందు ఆతనిని స్మరించినాడు. అతని అంత్య ప్రాసల రచనా విధానమునకు ఆకర్షితుడై అతని వలెనే శంపాలతలను గురిపిస్తూ రచించినాడు.

దాంతు హరిచరణ భక్తి
స్వాంతు రసాతలనిశాంతు నత్యంతదయా
వంతు సమతీత విధి క
ల్పాంతు బరమశాంతు నయ్యనంతు
  దంతున్.

నామది దలంచెద సుపర్ణ నామధేయు
మురహర విధేయు నమరసమూహ గేయు
గనక నిభ కాయు భక్షిత కాద్రవేయు
వక్త్రి కాంతి జితాత్రేయు వైనతేయు
(పీఠికా భాగములో
11, 12 పద్యములు)

అప్పకవి కవితను ఎగుడుదిగుడు దారుల గుండా గాకుండా సూటిగా సరళముగా నడిపించినాడు. రామాయణ మహామాలారత్నమైన హనుమంతుని, వెన్నుని దళవాయి అయిన విష్వక్సేనుని స్తుతిస్తూ రచించిన పద్యము లందుకు ప్రమాణములు.

పాయక కొల్తు రామజన
  పాలుడు జానకి జాడ దెల్పుచో
దోయధ గోష్పదంబు క్రియ
  దోప జిగాలునగాటి లంక క
త్ర్యాయత లీలబోయి దివి
  జారుల సోమల బోలె బట్టి బా
హాయత శక్తి గొట్టి సతి
  నారసి తద్విభు గన్న మారుతిన్.
(పీఠికలో 14 వ పద్యము)

గోష్పదీకృతవారాశిం మశకీకృత రాక్షసం అను శ్లోకమును ఈవృత్తము చక్కగా పొదిగినాడు.

తిన్నని వేత్రము కలుముల
కన్నియ పన్నియనుహస్తకమలతలమున
జెన్నొందు జగము మనిపెడు
వెన్నుని దళవాయి దలతు విష్వక్సేనున్
(పీఠికలో 13 వ పద్యము

అప్పకవీయమునకు పీఠిక వ్రాస్తూ విద్వాన్ శ్రీ రావూరి దొరసామిశర్మగారు (వావిళ్ల వారి ప్రచురణ పుట 110) అప్పకవి కవితను గురించి ఈవిధముగా ప్రశంసించినారు. వారిమాటలతోనే ఈవ్యాసమునకు ముగింపు పలుకుతున్నాము.

'అప్పకవీయము లక్షణగ్రంథమయ్యును ఇందలి కవిత మృదుమధురము. సాధారణముగా లక్షణగ్రంథములోని పద్యములు ఛందోబద్ధములు మాత్రమే. అందు యతిప్రాస పూజా కుసుమములు. జల్లిపల్కులు, మెండుగా నుండు నని పండితుల తలంపు. ఇతర గ్రంథములపట్ల నట్టి యభిప్రాయము నిజమ్మే కావచ్చుగాని యందుల కప్పకవీయకవిత యపవాదము. ఆమూలాగ్రము పద్యములు చక్కని తీంటువడని నడక గలవై యున్నవి. అప్పకవి పోతన భాగవతమును రేఫఱకారసాంకర్యమును నాదిలాక్షణికులు లుదాహరింపమాని రని చెప్పినను 'సలక్షణంబుగా కిమ్మహి నేమిటం గొదవ' యను నుదాత్త భావముగలవాడై పోతన కవితారీతి నంత్యానుప్రాసాది శబ్దాలంకర భూయిష్ఠముగా దన లక్షణ గ్రంథములోని పద్యములు వ్రాసెను. లక్ష్యములందు దశమస్కంధములోని కృష్ణచరిత్ర ఘట్టములు మెండుగ గలవు. కవిస్తుతిలో సహజపాండిత్యుని స్మరించెను. లక్షణభాగమున నిక్కమైన రసాలంకారాత్మక కవిత లేకున్నను గ్రంథావతారికా భాగమున నట్టికవిత రాణించుచున్నది.'

—...—

# ఈ పక్షంలో

## వసంతోత్సవము

19-4-81 తేదీ ఆదివారం సాయంకాలం 6 గం॥లకు రాజమండ్రి అల్యూమినియం మర్చంట్సు అసోసియేషను హాలులో హుసారుక్లబ్బు యాజ్యమానమున వసంతోత్సవ సందర్భమున సాహిత్యసభ జరగినది. సభకి శ్రీ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు అధ్యక్షత వహించిరి. మహాభారత పరిశోధకులు ముఖ్యులగు డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు డా. నందుల గోపాలకృష్ణమూర్తి శ్రీ చేబోలు చిన్మయబ్రహ్మకవి ఎం.ఏ. గారలకు హుసారు క్లబ్బు పక్షమున సన్మానము జరగినది. ప్రతిపర్వమున రసము చిప్పిలు భారత పరిశీలనకు చెందిన సభలో క్లబ్బు వారిచే సభ్యులకు ఇక్షు రస సమారాధనము గావింపబడినది.

సభ శ్రీ S V రాఘవేంద్ర రావు ఎం. ఏ. బి. యిడీ గారి ప్రార్థనతో ఆరంభమయినది. ఆరంభమున క్లబ్బు ప్రధాన కార్యదర్శి డాక్టరు యం. రామకృష్ణారావు గారు అధ్యక్షుని ముఖ్య అతిథిని సభా ప్రారంభకుని సన్మాన్యులను వేదికపైకి ఆహ్వానించి పరిచయము చేసిరి. ప్రార్థనానంతరము శ్రీ సత్యవోలు వేంకటేశ్వర రావు జూనియరు ఇంజనీరు 'వసంతం వచ్చింది' అనే గేయమును కోకిలకంఠముముతో ఆలపించి సభకు వసంత శోభను చేకూర్చినారు.

అధ్యక్షులు తమ తొలిపలుకులలో వసంతఋతు ప్రాధాన్యాన్ని వేద ప్రమాణసహితంగా వివరించి భారతం ఆంధ్రభాషకి, కావ్యసరస్వతికి వసంతోదయం అని తెలిపి, భారత గ్రంథ వ్రాతప్రతుల్ని తత్పరిశోధన యందలి క్లిష్టతనీ వివరించారు.

సభా ప్రారంభకులు గానకళోద్ధారక శ్రీ బుగ్గా పాపయ్యశాస్త్రిగారు హుసారుక్లబ్బు వారి సాహిత్య వ్యాసంగాన్ని ప్రశంసించి వారు తలపెట్టిన ప్రతివర్ష వసంతోత్సవ కార్యక్రమానికి తమ ఆశీస్సులిస్తూ తోడ్పాటును వాగ్దానముచేసిరి.

ముఖ్య అతిథి ఇన్ కంటాక్సు ఆఫీసరు శ్రీ సామంటి శ్రీరామమూర్తి గారు భాషాపోషణ గావించు ప్రభువులు జమీందార్లు లేనియీ కాలమున ప్రజలు పూనుకొని ఉత్తమ గ్రంథములనుకొని చదువవలెననిరి. కవులకు పండితులకు దగిన ప్రోత్సాహమియ్యవలెననిరి. భారతము వంటి మహాగ్రంథముల పరిశోధన చేసిన వారిని సన్మానించుట మిక్కిలి యుచితమనిరి

క్లబ్బు కార్యనిర్వాహక వర్గము వారు పరిశోధకులు ముగ్గురకు సుగంధద్రవ్యములు, శాలువాలు, ఒసగి సత్కరించిరి

భారతములో తాము పరిశోధించి, వ్రాసిన విషయములను కొన్నిటిని డా. మృత్యుంజయరావుగారు సోదాహరణముగా వివరించిరి. నన్నయ ఋషితుల్యుడని వేదధర్మప్రకాశకుడని వక్కాణించిరి. వ్యాస భారతమునకు నన్నయ్య గావించిన పరిష్కారమును వివరించిరి.

శ్రీ నందుల గోపాలకృష్ణమూర్తి ఎం. ఏ, పిహెచ్. డి. గారు ఆంధ్రమహాభారతము ఔపదేశిక ప్రతిపత్తి 'అనువిషయము'పై తాము పరిశోధించి వ్రాసిన కొన్ని అంశములను వివరించిరి. భారతము నిత్య జీవిత విధానాన్ని తేటతెల్లముగా బోధించినదని, మానవుడు సత్పథంలో నడవడానికి కావలసిన ధర్మములన్నియు భారతమున గలవని తెలిపి 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని ... పద్యానికి వివరణ యిచ్చిరి. ఆపద్యము భారతము పట్ల సార్థకమని తమ పరిశోధనలో ఋజువైనట్లు తెల్పిరి. భారత పఠన పారాయణములు పెంపొందుటకు కృషి చేయవలెననిరి.

శ్రీ చేబోలు చిన్మయ బ్రహ్మకవిగారు కవిసార్వభౌమ శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి గారి, జీవితము 'గ్రంథములు' అను విషయమును గురించి తాము పరిశోధన చేయుచున్న విధానమును గురించి వివరించిరి. అందులో ఎదురౌతున్న చిక్కులను గురించి, వాటిని అధిగమించుటకు చేయుచున్న కృషిని, తెలిపిరి. శిల్పము చెడకుండ శ్రీకృష్ణభారతము మూలానుసారముగా రచింపబడిన విధమును ప్రశంసించిరి. కృష్ణభారతమును వ్యాస భారతతోను, కవిత్రయ భారతముతోను సరిపోల్చి పరిశోధించుట క్లేశావహమైనను త్వరలో ఆకార్యమును పూర్తి చేయనున్నట్లు తెలిపిరి.

క్లబ్బు ప్రధానకార్యదర్శి యం. రామకృష్ణారావుగారి వందన సమర్పణముతో 10 గం॥లకు సభ ముగిసినది.

―――・・・―――

## కృతిసమర్పణ గ్రంథావిష్కరణ మహోత్సవము.

పరమ పవిత్రమైన శ్రీరామనవమి ఆదివారం సాయంకాలం 6 గంటలకు కాకినాడ శ్రీ సూర్యకళామందిరంలో శ్రీ సీతారామ కల్యాణమహోత్సవము శ్రీ శ్రీరామ చంద్రపరబ్రహ్మకు శ్రీ బులుసు వేంకటేశ్వరులు ఎం ఏ. రచించి ప్రకటించిన 'శ్రీరామ కథా సామ్రాజ్యము' (వివిధరామకథల సమీక్ష) Lives of Ancient Indian Saints (Volume one) ప్రాచీన భారత వర్ష మహర్షుల చరిత్ర తొలి సంపుటము ఆంగ్లరచనము అను కృతికన్యకలకు శ్రీ సీతామహాలక్ష్మి స్వరూపలకు శాస్త్రోక్తముగా వివాహమహోత్సవము జరిపించిరి. షణ్ముఖ బ్రహ్మ వలె ఆఱుగురు ఉద్దండులగు బ్రహ్మలు వేదఘోష చేయుచుండగా సుప్రసిద్ధ నాదస్వర వాద్య బృందయుగళము మంగళవాద్యఘోష కావించుచుండగా సరిగా ఆఱుగంటలకు కల్యాణమహోత్సవము ప్రారంభమైనది. ప్రేక్షకుల ఆనందోత్సాహములు

పెల్లుబుకు చున్నను ప్రశాంత నిశ్శబ్దవాతావరణము సభ్యులను సమ్మోహితులను జేసి వైచినది. శ్రీరామచంద్రపరబ్రహ్మ పాదములు కడిగి శ్రీవేంకటేశ్వర జనకర్షి సీతామహాలక్ష్మి సమాన కృతి కన్యాయుగళమును శ్రీరామునికర్పించుట, వేదోక్త వివాహము, మంగళసూత్రధారణ, తలంబ్రాలు, వేదోక్తస్వస్తి, ఆశీస్సులు; కల్యాణ వైభమును సహస్రముఖముల, చాటినవి.

కల్యాణమహోత్సవానంతరము సభ్యులకు వడపప్పు పానకము, ప్రసాదము ప్రతి ఒకరికి వారు వారు కూర్చున్న స్థలములలోనే అందింప బడినవి.

తదనంతరము జరిగిన మహాసభకు నాందిగా శ్రీపరవస్తు గోవిందాచారి ఒక్కొక్కరిని ఒక్కొక్క పద్యములో వేదికనలంకరింప వలసినదిగా ఆహ్వానించిరి. తొలుత కృతికన్యాప్రదాత శ్రీ బులుసు వేంకటేశ్వరులు, తరువాత సభాధ్యక్షురాలు శ్రీమతి రమాదేవి, భారతీయవిద్యాభవన్ కు చెందిన శ్రీ యస్ వేంకటరావు, కుమారి సత్యజ్ఞానేశ్వరి, శ్రీమతి ఉమారాణి, శ్రీమతి సర్వమంగళాదేవి, శ్రీమతి పద్మావతిదేవి సభావేదిక నలంకరింపగా నందరిని పూలమాలలతో, ముంచెత్తిరి. ఈ మహాసభ శ్రీగాయత్రీ మహిళా మండలి (జగన్నాథపురం) శ్రీ నవ్యాంధ్ర మహిళామండలి (గాంధీనగరం) శ్రీ శ్రీదేవీ సత్సంగము (శ్రీరామనగరం) వారి సంయుక్తాధ్వర్యమున జరుగుటచే పెక్కుమంది స్త్రీలతో పుర ప్రముఖులతో సభాంగణము క్రిక్కిరిసి పోయినది.

ప్రార్థనానంతరము అధ్యక్షురాలు శ్రీమతి రమాదేవి గ్రంథద్వయమును ఆవిష్కరింపవలసినదిగా శ్రీ వేంకటరావును కోరిరి. సభ్యుల కరతాళధ్వనుల మధ్య మంగళవాద్య వేదఘోషల మధ్య కృతిద్వయమును శ్రీ నేమాని వేంకటరావు ఆవిష్కరించిరి. కృతిసమర్పణ (అంకిత) పద్యగత్నములను ఆంధ్రమున నాంగ్లమున శ్రీ బులుసు వేంకటేశ్వరులు చదివి వివరించిరి. శ్రీ శ్రీరామునకు ఏకపత్నీవ్రతభంగము కలుగనట్లు తమకృతి కన్యాద్వయమును శ్రీ సీతామహాలక్ష్మి స్వరూపలనుగా భావించుట, తమకృతికన్యలను క్షత్రియుడైన రామునకిచ్చుట ధర్మభంగము కాన ధర్మభంగము కాకుండునట్లు శ్రీరాముని రామచంద్ర పరబ్రహ్మముగా భావించి బ్రహ్మకన్యకలను పరబ్రహ్మకిచ్చినట్లు వర్ణించుట అందరికి ఆనంద ప్రదమైనది.

పిమ్మట శ్రీమతి రమాదేవి 'శ్రీరామ కథా సామ్రాజ్య' కృతినిగురించి శ్రీ వేంకటరావు 'Lives of Ancient Indian Saints' కృతిని గురించి సభ్యులను తన్మయ పరచు గంభీరోపన్యాసముల నొసంగి రెండుకృతులు రెండు ధ్రువతారలని ప్రశంసించిరి.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు ఐదువేల రూప్యములతోను, శ్రీ గాయత్రీ మహిళా మండలి, నవ్యాంధ్ర మహిళా మండలి, శ్రీదేవీసంఘము వారు, నూటపదార్లు నూటపదార్లతో దుశ్శాలువాలతో వస్త్ర యుగ్మములతోను శ్రీ బులుసు వేంకటేశ్వరులును సమ్మానించిరి. శ్రీ తడవర్తి వేంకటేశ్వరరావు, శ్రీ అల్లమరాజు రామమూర్తి, శ్రీ అవసరాల రామారావు। ప్రభృతులు ఒక్కొక్క నూట పదార్లతో కవిని సత్కరించిరి. డా. కస్తూరి వేంకటాచలము నూతన వస్త్రము లొసంగిరి.

కుమారి సత్యజ్ఞానేశ్వరి (మహారాణి కళాశాల ఆంధ్రోపన్యాసకురాలు) తమ గురువులగు శ్రీ వేంకటేశ్వరుల కవితా పాటవాన్ని, ప్రజ్ఞా, ప్రాభవాల్ని గురించి చక్కగా మాటాడినది.

తరువాత జరిగిన కావ్యపఠన కార్యక్రమములో శ్రీ బులుసు వేంకటేశ్వర విరచిత 'శ్రీ వేణుగోపాలశతకము' నుండి శ్రీమతి పి. ఉమారాణి బి. ఏ; అతి మనోజ్ఞ కంఠముతో కావ్యగానము చేసి సభ్యులను ఆనందతన్మయులను జేసినది. అనంతరము శ్రీమతి అల్లమరాజు సర్వమంగళాదేవి శ్రీ వేంకటేశ్వర విరచిత రామాయణ దేవీ భాగవతముల నుండి పెక్కు పద్యములను మనోజ్ఞముగా గానము చేసిరి. పిమ్మట శ్రీమతి పద్మావతీ దేవి వేంకటేశ్వర విరచిత 'శ్రీ సీతారామ కల్యాణ మహోత్సవ శతకము' నుండి పెక్కు పద్యములు మనోహర కావ్యగానము చేసిరి. వక్తలకు, కావ్యగాయనులకు సన్మానకర్తలకు ముఖ్యశ్రోతలకు పుస్తక యుగళమును పంచిపెట్టి శ్రీ బులుసు వేంకటేశ్వరులు తమకు జరిగిన సమ్మానమునకు అందరికి కృతజ్ఞత తెలిపిరి. ఇన్ని మహిళామండలులు, ఇంత హృదయపూర్వకముగా ఈ మహాసభను నిర్వహించుట అపూర్వమని మహావిశేషమని వారందరిని అభినందించిరి.

శ్రీమతి రమాదేవి తమ తుది పలుకులలో శతాధిక కృతిముఖముల విస్తరించిన శ్రీ వేంకటేశ్వర మహావాణి అజరామరము అద్వితీయము అని, ఆ వాణిని నిరంతరము మన మితోధికముగ పూజించుచుండ వలసినదే అనీ శ్రీమద్రామాయణ భారత భాగవత, దేవీభాగవతాది మహాకృతికర్త మన సమకాలికు లగుట మనమహాభాగ్యమని పలికిరి.

శ్రీ గాయత్రీ మహిళామండలి వారి రామమంగళ గాన సుధతో సభ సరిగా తొమ్మిది గంటలకు ముగిసెను.

— ... —

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో గూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.